## మీకు కావలసినవి :

- కార్డుబోర్డు
- కార్డు-పేపర్
- పాప్లిన్ బట్ట, ఎరుపు, ముదురు జేగురు రంగు
- వెల్వెట్ కాగితం
- నల్ల లావు దారం (కార్డ్)
- చదరపు తెల్లని సిల్క్ లావు దారం (కార్డ్)
- పాతపుస్తకాలపైనుంచి తీసిన కేన్వాసు లైనింగు
- ఫెవికాల్ ఎమ్ ఆర్ ఎడ్హెసివ్




1. కార్డ్‌బోర్డు నుంచి 6" వ్యాసము గల గుండ్రటి ముక్కను కత్తిరించండి. చూపించినట్లుగా 2½×34" గల రెండు స్ట్రిప్స్‌ని కార్డ్-పేపర్ నుంచి కత్తిరించండి. దానితో బాటే.




2. ఎర్ర పాప్లిన్ బట్ట నుంచి 7" వ్యాసము గల గుండ్రటి ముక్కని కత్తిరించి, దానిని ఆ కార్డుబోర్డు గుండ్రటి దానిపైన అతికించండి. మిగిలి ఎక్కువగా వున్న పాప్లిన్ బోర్డర్‌ని కార్డుబోర్డు వెనకాల అతికించండి.




3. ముదురు జేగురు రంగు పాప్లిన్ బట్ట నుంచి రెండు 6"×36" స్ట్రిప్స్‌ని కత్తిరించండి. ఇక ఆ కార్డు-పేపర్ స్ట్రిప్స్‌ని పాప్లిన్ స్ట్రిప్స్‌పైన పెట్టండి. ఎక్కువగా వున్న పాప్లిన్‌ను మడిచి, ఫెవికాల్ ఎమ్ ఆర్ ఎడ్హెసివ్‌తో అంటించండి. ఇది రెండు లూప్స్‌గా తయారు అవుతుంది.



4. వలయాకారపు దాని వెనకగా, చూపించినట్లుగా, యీ రెండు లూప్స్‌ని అంటించండి.



5. వెల్వెట్ కాగితంలోంచి, కిట్టీ ది క్యాట్ యొక్క పాదాలు, కళ్ళు, ముక్కు ఆకారాల్ని కత్తిరించండి. చూపించినట్లుగా అతికించండి. తెల్లరంగు కార్డ్‌ని లూప్స్ పైన అతికించండి, అవి కాళ్ళు అవుతాయి. వాటిని ముఖంపైన కూడా చూపించినట్లుగా అతికించండి. మరి నల్ల రంగు కార్డ్‌ని ముఖంపైన అతికించండి, అవి కంటిరెప్పలు మీసాలు అవుతాయి.



6. కార్డ్-పేపర్ నుంచి సరియైన సైజులో రెండు పాకెట్స్‌ని కత్తిరించండి. పాత నోట్‌బుక్స్ యొక్క కేన్వాస్ లైనింగులను చివరల కోసం అతికించండి. ఎర్ర పాప్లిన్‌తో వాటిని కప్పి, లూప్స్‌కి పాకెట్స్‌ని అతికించండి.



7. కార్డ్‌బోర్డ్ నుంచి కిట్టీ యొక్క చెవుల ఆకారాల్ని కత్తిరించండి. వెల్వెట్ కాగితాన్ని తెల్ల సిల్క్ కార్డ్‌ని వాటికి అతికించండి. మరి అది కిట్టీ యొక్క తలకి అతికించండి. కార్డ్ నుంచి హుక్‌ని తయారుచేసుకోండి. దాన్ని చూపించినట్లుగా, ఫెవికాల్ ఎమ్ ఆర్ ఎడ్హెసివ్‌తో అంటించండి.




® ఎమ్ ఆర్
# ఫెవికాల్
సింథెటిక్ ఎడ్హెసివ్

**బాగా పనిచేసేది, మరెంతో పేరున్నది**
**ఫెవికాల్ ఎమ్ఆర్ అంటేనే అది**

# పుప్పి పళ్లను కనుగొన్నాడు మా బాబు ఒకనాడు!
























## ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్

రుచికరమైన మరియు నురుగునిచ్చే టూత్‌పేస్టు మీ పళ్లను మరియు చిగుళ్లను రెండింటినీ రక్షిస్తుంది.



FOR THE GUMS

**Forhan's**

with active FLUORIDE to check tooth decay

331 F 183 TEL

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''పరివర్తన''] కు ఆధారం, ''శివ'' రచన. ధనలోభం కొద్దీ దొంగతనాలూ, హత్యలూ చేసేవాడు, తాత్కాలికంగా దండనకు గురికాకుండా తప్పించుకోగలడు కాని, అలాంటి దుష్టుడు ఏదో ఒక సందర్భంలో, అనాలోచితంగా తన నిజరూపాన్ని బయట పెట్టుకుంటాడు. ఇది ''కముజుపిట్టసాక్ష్యం'' అన్న కథలో తెలుసుకుంటాం.

## అమరవాణి

యది దాతుః సఖా లుబ్ధః, దానం తత్ర హి దుర్లభమ్,
న దృశ్యతే కల్పతరో, ర్మూలే కంటకకుంజవత్.

[దానగుణం వున్న వానికి, లోభి అయిన మిత్రుడుండడం జరిగితే, దానం దొరకడం దుర్లభం, ఆ లోభి కల్పవృక్షం కింద ముళ్ళ పొదలాగా కనబడతాడు.]

సంపుటి 76 ఫిబ్రవరి '85 సంచిక 2

విడి ప్రతి : 2-00 : : సంవత్సర చందా : 24-00



# చందమామ కబుర్లు



## ఆసియాలో కెల్లా పెద్ద టెలిస్కోప్

ఆసియా ఖండంలో కెల్లా పెద్ద టెలిస్కోప్ మన దేశంలోని వాల్‌చంద్ నగర్‌లో రూపొందించబడింది. 15.7 మీటర్ల పొడవూ, 8.7 మీటర్ల వెడల్పూ, 11.7 మీటర్ల ఎత్తూ వున్న ఈ 230 సెం. మీ. టెలిస్కోప్‌ను సివిల్ ఏవియేషన్ విభాగంలోని భారతీయ ఖగోళ విజ్ఞానసంస్థ ఉపయోగిస్తున్నది।

## నూరేళ్లు జీవించడం ఎలా?



దక్షిణ మలేషియాలోని మువార్‌కు చెందిన ఓమర్ బేదాన్ అనే 106 సంవత్సరాల వృద్ధుడు—మనిషి నూరేళ్ళు, అంతకన్నా ఎక్కువ కాలం జీవించడం ఏమంత కష్టం కాదంటాడు. అయితే అలా జీవించాలనుకున్నవాళ్ళు—ఓర్పును ఏ మాత్రం కోల్పోకూడదనీ, ఇచ్చిన మాట తప్పరాదనీ, అబద్ధాలు చెప్పకూడదనీ, అరువు తెచ్చుకోకూడదనీ ఆయన చెబుతున్నాడు।



## అనాథ యువకుడి నిజాయితీ!

హాలీవుడ్‌కు చెందిన పదిహేడు సంవత్సరాల ఎరిక్ డీ వైల్డ్ అనే అనాథ యువకుడికి నిర్జన ప్రదేశంలో తిరగడం అంటే ఎంతో ఇష్టం. ఒకసారి పొదమాటున ఒక సంచీ అతడి కంటపడింది. అందులో నగలున్నాయి. అతడు దాన్ని పోలీసులకు అప్పగించాడు. అది తమదంటూ 1,400 మంది వచ్చారుగానీ, ఎవరూ తమదని నిరూపించుకోలేకపోయారు. ఫ్లోరిడా చట్టప్రకారం ఆ సంచీని ఎరిక్‌కే అప్పగించారు. అందులోని నగలవిలువ 35 కోట్ల రూపాయలకు సమానం।

## మీకు తెలుసా?

1. ఆసియా ఖండంలోకెల్లా పెద్ద ద్వీపం ఏది?
2. ప్రస్తుతం స్పెయిన్, పోర్చుగల్ ప్రాంతాల ప్రాచీన నామం ఏదో మీకు తెలుసా?
3. ఇజ్రాయెల్ ప్రధాన రేవు పట్టణం ఏది?
4. సూయెజ్ కాలువకు మొదటా, చివరా వున్న రేవు పట్టణాలు ఏవో మీకు తెలుసా?
5. సోవియట్ రష్యా, ఆఫ్ఘనిస్థాన్ సరిహద్దుల్లో ప్రవహిస్తున్న నది ఏదో మీకు తెలుసా?

(సమాధానాలు 64 వ పేజీలో)



# ఇద్దరు యజమానులు

సీతయ్యా, సోమయ్యా యిరుగుపొరుగున వుంటున్నారు. ప్రతి చిన్న విషయానికీ హడావిడి చేయడం సీతయ్యకు మామూలైతే, మిన్నువిరిగి మీదపడుతున్నా చలించకపోవడం సోమయ్య పద్ధతి.

ఒక రోజున సీతయ్య ఇంట్లో నాలుగు వెండికాసులు పోయినై. అతను ఇల్లంతా వెతికిచూసి, భార్యతో సంగతి చెప్పి, "నువ్వేమైనా తీశావా?" అని అడిగాడు.

"నీకు చెప్పకుండా ఎప్పుడైనా తీశానా," అన్నది భార్య.

అప్పుడు సీతయ్య కొడుకును పిలిచి అడిగాడు. వాడు కూడా ఆ డబ్బు సంగతి తెలియదన్నాడు.

"అయితే, డబ్బు ఏమైందంటారు?" అన్నాడు సీతయ్య కోపంగా.

సీతయ్య భార్యా, కొడుకూ కూడా ఇల్లంతా వెతికి చూశారు. పోయిన డబ్బు దొరకలేదు. అప్పుడు సీతయ్య భార్య భర్తతో, "నువ్వు ఆ డబ్బు గూట్లో పెట్టడం మంచిది కాదు. మన పనిమనిషికి యీ మధ్య చేతివాటుతనం అలవాటైంది. అది ఇంట్లో పనులు చేసేటప్పుడు యింత చింతపండో, పప్పులో, బియ్యమో మూటగట్టుకు పోతున్నది," అన్నది.

"అది నిజమే, నాన్నా! మొన్న దాని దొంగతనం నేను స్వయంగా చూశాను. ఆ సంగతి అమ్మతో చెప్పాను కూడా," అన్నాడు కొడుకు.

"అప్పుడు నువ్వేం చేశావు?" అని సీతయ్య భార్యను అడిగాడు.

"అది చాలా మొండిది. ఎందుకే బియ్యం మూటకడుతున్నావని అడిగితే; నువ్వేకదమ్మా తీసుకుపొమ్మన్నది. అంతలోనే మతిమరుపా! వద్దంటే బస్తాలో పోసేస్తాను, అన్నది. అంత జరిగాక

"వసుంధర"



బొత్తిగా తెలియదంటూ కేకలు వేయసాగాడు. ఈ గొడవకు యిరుగుపొరుగు అంతా పోగయ్యారు. జరిగినది విని కొందరు సీతయ్యను తప్పుపట్టారు. మరి కొందరు సీతయ్య భార్యదీ, కొడుకుదీ తప్పన్నారు.

ఇది జరిగాక సీతయ్య రెండు రోజులు ఇంట్లో భోజనం చెయ్యలేదు. ఈ సంగతి నలుగురికీ చెప్పుకుని సీతయ్య భార్య చాలా విచారపడింది. క్రమంగా జరిగింది మరుగునపడిపోయి, సీతయ్య మామూలు వాడయ్యాడు.

ఈ గొడవంతా జరిగినప్పుడు సోమయ్య ఊళ్ళో లేడు. ఆయన భార్య మాత్రం వున్నది. సోమయ్య పట్నం వెళ్ళి, వారం రోజులుండి వచ్చాడు.

అయితే, సోమయ్య తిరిగి వచ్చిన మర్నాడే, అతడి ఇంట్లో పది వెండి కాసులు పోయినై. సోమయ్య భార్యకు డబ్బు విషయం చెప్పి, "నువ్వుగాని తీశావా?" అని అడిగాడు.

ఆమె తనకు తెలియదన్నది. కొడుకు నడిగితే, వాడూ అలాంటి జవాబే యిచ్చాడు. సీతయ్య పనిమనిషే సోమయ్య ఇంట్లోనూ పని చేస్తున్నది.

"దానిది దొంగబుద్ధి అని సీతయ్య భార్య నాతో చెప్పింది. తప్పకుండా దానిదే

బావుండదని తీసుకుపొమ్మన్నాను," అన్నది సీతయ్య భార్య.

"అయితే యింకేం, నువ్విచ్చిన అలుసువల్లనే, అది అట్లా తయారయింది. ఈ రోజున డబ్బు పోయింది! దాని సంగతి నాకు ముందే ఎందుకు చెప్పలేదు?" అంటూ సీతయ్య భార్య మీద పెద్దగా రంకెలు వేయసాగాడు.

అప్పుడు కొడుకు కలగజేసుకుని, "ఊరుకో, నాన్నా! మన జాగ్రత్తలో మనం వుండాలి, అంతే," అన్నాడు.

కొడుకు యిలా అనగానే సీతయ్యకు మరింతగా కోపం వచ్చింది. తన కొడుక్కూ, భార్యకూ డబ్బు విలువ

యీ పని అయివుండాలి!'' అన్నది సోమయ్య భార్య.

''మనింట్లో అది దొంగతనం చేస్తూండగా ఎప్పుడైనా చూశావా?'' అని అడిగాడు సోమయ్య.

''లేదు,'' అన్నది సోమయ్య భార్య.

''పనిమనుషుల్ని దయగా చూసుకుంటూ, అవసరసమయాల్లో వాళ్ళను ఆదుకునే యజమానుల ఇళ్ళల్లో దొంగతనాలు జరగవు. అయితే ఎక్కువ పని చేయించుకుని, తక్కువ డబ్బిచ్చేవాళ్ళ యిళ్ళల్లో, పనిమనుషులు మొండిగా వుంటారు. ఒక సమయం డబ్బు నేనే తప్పులెక్క పెట్టుకుని వుంటాను,'' అన్నాడు సోమయ్య.

''అలాగని ఊరుకుంటామా? పనిమనిషిని నిలదీసి అడగాల్సిందే!'' అన్నది సోమయ్య భార్య.

సోమయ్య కాస్త విసుగ్గా, "ఇంతవరకూ మనింట్లో దొంగతనం జరగలేదు. ఇప్పుడూ జరిగివుండదు. ఒకవేళ జరిగినా, అది నా అశ్రద్ధవల్లనే జరిగింది. ఇకముందు, నా జాగ్రత్తలో నేనుంటాలే,'' అన్నాడు.

''అయినా, ఒకసారిదాన్ని అడగడంలో తప్పేమిటి?'' అన్నది సోమయ్య భార్య.

''ఒకవేళ అది దొంగతనం చేసివుండకపోతే, దానికి కోపం వస్తుంది. ఎంత నమ్మకంగా వున్నా యజమానులు నమ్మరనుకుని, నిజంగానే దొంగతనాలు ప్రారంభిస్తుంది. మన జాగ్రత్తలో మనం



వుంటే సరిపోతుంది.'' అన్నాడు సోమయ్య.

భర్త యిలా మాట్లాడడం సోమయ్య భార్యకు నచ్చలేదు. ఆమె సాధిస్తున్నట్టు, ''నువ్వెప్పుడూ యింతే! పది కాసులు పోయినా, నీకు తేలు కుట్టినపాటి బాధ కూడా లేదు. నాలుగు కాసులకే, మన పక్కింటి సీతయ్య నానా హడావిడీ చేశాడు;'' అన్నది.

''అలాగా! అయితే పద, సీతయ్య ఇంటికి వెళదాం,'' అని భార్యను వెంట బెట్టుకుని సీతయ్య ఇంటికి వెళ్ళాడు సోమయ్య.

ఆ సమయంలో సీతయ్య ఇంట్లోనే వున్నాడు. అతను, ''రా, సోమయ్యా! ఏమిటి విశేషం?'' అంటూ సాదరంగా సోమయ్యను ఆహ్వానించాడు.

''ఏమీలేదు. మొన్నా మధ్య నీ ఇంట్లో నాలుగు వెండికాసులు పోతే, ఏదో చేశావట గదా—అదేమిటో చెప్పు? అప్పుడు నేనూళ్లో లేను,'' అన్నాడు సోమయ్య.

సీతయ్య గర్వంగా నవ్వి, ''అదా! నా పెళ్ళాన్నీ, కొడుకునూ నానా తిట్లూ తిట్టాను. ఊరంతా అదిరిపోయేంత గొడవ చేశాననుకో,'' అన్నాడు.

''మరి డబ్బు దొరికిందా?'' అన్నాడు సోమయ్య తాపీగా.

''లేదు. ఏం, అలా అడుగుతున్నావు?'' అన్నాడు సీతయ్య ఆశ్చర్యంగా.

''ఏమీలేదు. డబ్బు దొరికితే, నాకు చెప్పు. అప్పుడు నేనూ ఊరంతా అదిరిపోయేంత గొడవ చేస్తాను. నా డబ్బూ పోయింది మరి!'' అని భార్యను తీసుకుని ఇంటికి వెళ్ళిపోయాడు సోమయ్య.

ఈ సంభాషణ విన్న సోమయ్య భార్యకు ఒక సత్యం అర్థమైంది. ఏసమస్య అయినా హడావిడివల్లా, కోపతాపాలవల్లా పరిష్కారంకాదనీ, అందుకు వేరేఉపాయం చూసుకోవాలనీ తెలిసి వచ్చింది. అటు పైన ఆమె ఇంట్లో దొంగతనాలు జరగలేదు. సీతయ్య ఇంట్లో మాత్రం అడపా దడపా ఏవో జరుగుతూనే వున్నవి.






## 4

[సుబాహుడు బిచ్చగాడులా నటించి సర్పకేతుడి సైనికుల బారిపడకుండా తప్పించుకున్నాడు. సర్పకేతుడి సైనికులు మాయోపాయం ప్రయోగించి వీరపుర పట్టణ ద్వారాలు తెరుచుకుని, పట్టణంలో ప్రవేశించారు. రానున్న ప్రమాదాన్ని గురించి, తన యజమాని చంద్రవర్మతో చెప్పేందుకు, సుబాహుడు రాజప్రాసాదం కేసి పరిగెత్తసాగాడు. తరవాత—]

సుబాహుడు తను తాత్కాలికంగా ప్రమాదాన్నుంచి బయటపడినా, తనను వెన్నాడి కొందరు సైనికులు వస్తున్నట్టు, వాళ్ళ అడుగుల చప్పుడును బట్టి గుర్తించాడు. ఆగి వెనుదిరిగి చూసేందు కూడా అవకాశం లేదు. తను, ఎంత త్వరగా పరిగెత్తి రాజప్రాసాదంలో జొరబడ గలుగుతానా అన్నదాని మీదే అతడి మనస్సు కేంద్రీకరింపబడి వున్నది.

వెనుక కేకలూ, చప్పట్లూ మరింత దగ్గిర అవుతున్నవి. అంతలో సుబాహుడు రాజప్రాసాదం ముందున్న జలయంత్రం చాటుగా ముందుకు పరిగెత్తి, ప్రాసాద ద్వారంముందు కాపలా వున్న భటులను వుద్దేశించి, ''నేను సుబాహుణ్ణి, దారి యివ్వండి! నన్ను తరుముకు వస్తున్న వాళ్ళు సర్పకేతుడి సైనికులు. వాళ్ళను అడ్డగించండి. మన భటుల కందరికీ



హెచ్చరిక యివ్వండి." అంటూ కాపలా భటులు దారి యివ్వగా ఛెంగున ప్రాసాదంలో ప్రవేశించాడు.

ఈలోపల కాపలా భటులు కత్తులు దూసి, తమను సమీపిస్తున్న సర్పకేతుడి సైనికులను ఎదుర్కొన్నారు.

సుబాహుడు, చంద్రవర్మ వుండే మేడ పై భాగానికి మెట్లమీదుగా పరిగెత్తుతూ ఎలుగెత్తి, "యువరాజా, ఘోర ప్రమాదం! సర్పకేతుడి సైనికులు పట్టణంలో జొరబడ్డారు." అంటూ అరవసాగాడు.

సుబాహుడి కేకలకు, నిదురిస్తున్న చంద్రవర్మ వులిక్కిపడి లేచి హడావిడిగా పడకగది నుంచి బయటికి వచ్చాడు. అతడికి ప్రాసాదం ముందుగల రాజమార్గం మీద పెద్ద కలకలం వినబడింది. అతడు ఆశ్చర్యపడుతూ మిద్దెమీదికి పరిగెత్తి పిట్టగోడ నానుకుని ఆ కలకలం వచ్చిన వైపుకు చూసేంతలో, సుబాహుడు రొప్పుతూ అక్కడికి వచ్చాడు.

"యువరాజా! సర్పకేతుడి సైనికులు మోసం చేసి పట్టణ ద్వారాలు తెరుచుకుని లోపల ప్రవేశించారు. మన భటులను హెచ్చరించండి. శత్రుసైనికులు చాలామంది ఈసరికే ప్రాసాదప్రాంగణంలో ప్రవేశించి వుండవచ్చు." అన్నాడు.

చంద్రవర్మ ఒక్క తృటికాలం నిశ్చేష్టుడయ్యాడు. అంతలో రాజమార్గానికి యిరువైపులా వున్న గృహాలనుంచి పెద్ద పెద్ద మంటలు లేచినై. గుర్రాల సకిలింపులూ, సైనికుల కేకలూ, గృహస్థుల ఆర్తనాదాలూ చూస్తూండగానే మిన్నుముట్టినై.

చంద్రవర్మ, సుబాహుడి కేసి తిరిగి, "మా తండ్రిగారెక్కడ? ఆయన వెంట నువు యశోవర్ధన మహారాజుగారి వద్దకు వెళ్ళావుగదా?" అని అడిగాడు.

సుబాహుడు ఆ ప్రశ్న వింటూనే వెలవెల పోయాడు. అతడు ఎంత ప్రయత్నించినా నోటమాటరాలేదు. ఇప్పటి విపత్కర



పరిస్థితుల్లో సూర్యవర్మ దుర్మరణం సంగతి చెప్పటం ఏమీ మంచిది కాదని అతడికి మెరుపులా తోచింది. ముందు, ద్రోహబుద్ధితో పట్టణం ప్రవేశించిన సర్ప కేతుడి అనుచరులను సర్వనాశనం చేయాలి. ఆ తరవాత అవకాశం కలగగానే అన్ని విషయాలూ సాకల్యంగా మాట్లాడుకోవచ్చును.

"యువరాజా! తమ తండ్రిగారు వీర పుర మార్గంలో వున్నారు. ప్రస్తుత కర్తవ్యం గురించి ఆలోచించండి. ఇప్పటికే సర్ప కేతుడి సైనికులు పట్టణానికి నిప్పంటించు తున్నారు. ఏ నిమిషంలో అయినా, వాళ్ళు రాజప్రాసాదం ప్రవేశించవచ్చు." అన్నాడు సుబాహుడు, వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ.

అంతలో మిద్దెపైకి వచ్చే మెట్లమీద కలకలం బయలుదేరింది. వాళ్ళు శత్రు సైనికులు కావచ్చున్న అనుమానం కలిగింది సుబాహుడికి. అతడు ఒకగంతులో, చంద్రవర్మ పడకగదిలో జొరబడి, అక్కడ గోడకు వేలాడుతున్న కత్తులు రెండు తీసుకుని, బయటికి వచ్చి వాటిల్లో ఒక దానిని చంద్రవర్మకు యిచ్చాడు.

మెట్లమీదినుంచి, "యువరాజా, యువరాజా!" అన్న కేకలు వినిపించినై. ఆ కంఠస్వరం గుర్తించిన చంద్రవర్మ, "ఎవరు? సేనానీ!" అంటూ బదులు కేక వేశాడు.

వీరపుర సేనాని ధీరమల్లుడు ఆ కేక వింటూనే సూటిగా చంద్రవర్మ వున్న చోటుకు పరిగెత్తుకు వచ్చాడు.

"యువరాజా! ప్రమాదం ముంచుకు వస్తున్నది. యశోవర్ధన మహారాజు మన మీద ఎందుకు కత్తికట్టారో, నాకు తెలియటం లేదు. ఆయన పంపగా వచ్చిన సైనికులు పట్టణంమీద పడి, కనబడిన గృహానికల్లా నిప్పుపెడుతూ, దోచుకుం టున్నారు. కొందరు పట్టణ ప్రజలు కూడా, ఆ సైనికులతో కలిశారు." అన్నాడు ధీరమల్లుడు.




యశోవర్ధన మహారాజు పంపగా వచ్చిన సైనికులన్న మాట వింటూనే చంద్రవర్మ నిలువెల్లా వణికి, "సేనానీ...." అని ఏమో చెప్పబోయేంతలో, సుబాహుడు అందుకుని, "యువరాజా! ఆ సైనికులు యశోవర్ధన మహారాజు పంపగా వచ్చిన వాళ్ళు కాదు. మన పట్టణంలో ప్రవేశించేందుకూ తరవాత మనలను మోసగించేందుకూ సర్పకేతుడు పన్నిన కుయుక్తి అది. నేను మారువేషంలో వాళ్ళతోపాటు పట్టణంలో ప్రవేశించాను. పౌరదుస్తుల్లో వుండి, సైనికులకు సహాయం చేస్తున్నవాళ్ళు మన పట్టణవాసులు కారు. వాళ్ళంతా సంస్థాన ఎల్లల్లో వుండే పల్లెవాసులు. డబ్బు దొరుకుతుందని ఆ అమాయకులకు ఆశ చూపి, యిక్కడకి తెచ్చారు," అన్నాడు.

ఈ జవాబు వింటూనే సేనాని ధీరమల్లుడు నిశ్చేష్టుడయాడు. తరవాత అతడు చంద్రవర్మ కేసి తిరిగి, "సుబాహుడు చెప్పేదే నిజంలా తోస్తున్నది. సర్పకేతుడు యిలాంటి కుటిల పద్ధతులు అవలంబించటంలో అందెవేసిన చేయి. మాహిష్మతీ నగరం వెళ్ళిన మహారాజులకు కూడా అతడివల్ల ఏదైనా అపాయం కలగవచ్చు," అన్నాడు ధీరమల్లుడు.

"ముందు మనం చిక్కుకున్న అపాయం సంగతి ఆలోచించండి, సేనానీ! మన భటుల నందరినీ సమాయత్తపరిచి శత్రువులను పట్టణంనుంచి బయటికి తరిమే మార్గం ఏదో యోచించండి," అంటూ సుబాహుడు చంద్రవర్మకేసి చూశాడు.

చంద్రవర్మ, సుబాహుడు చెప్పిన దానికి అవునన్నట్టుగా తల వూపి, "సేనానీ, రాజప్రాసాద రక్షణ సంగతేమిటి? దీని రక్షణకు ఎలాంటి ఏర్పాటులు చేశావు?" అని అడిగాడు ఆదుర్దాగా.

"యశోవర్ధన మహారాజుకూ, జైఅంటూ కొందరు సాయుధులు కావలివాళ్ళను

తప్పుకుని భవన ప్రాంగణంలో ప్రవేశించారు. కాని, ఆ వెంటనే మన భటులు వాళ్ళను ఎదుర్కొని హతమార్చటం జరిగింది. ఆ వచ్చినవాళ్ళు సర్పకేతుడి సైనికులని మనవాళ్ళకు ముందుగానే సుబాహుడు హెచ్చరిక యివ్వటం చాలా లాభించింది,'' అన్నాడు ధీరమల్లుడు.

''అయితే, మన భటుల నందరినీ ఆయత్తపరుచు. కొద్దిమంది భటులను యిక్కడ కాపలా వుంచితే సరిపోతుంది. తక్కినవారితో పట్టణం ప్రవేశించి, ఆ సర్పకేతుడి సైనికులను వేటాడదాం,'' అన్నాడు చంద్రవర్మ.




''భటులందరూ ఆయత్తపరచబడ్డారు, యువరాజా! యశోవర్ధన మహారాజు పేర కొట్టే జేజేలు నన్ను కలవరపరిచినై. అందుకే మీ దగ్గిరకు వచ్చాను,'' అన్నాడు ధీరమల్లుడు.

ఆ సరికి పట్టణంలో అనేకచోట్ల పెద్ద పెద్ద మంటలు లేచినై. ఒక్క రాజమార్గం వైపునుంచే కాక, అన్ని వైపులనుంచీ కేకలూ, ఆర్తనాదాలు వినబడుతున్నవి. చంద్రవర్మ మిద్దెపైనుంచి కాలిపోతున్న పట్టణంకేసి ఓసారి సాలోచనగా చూసి పెద్దగా నిట్టూరుస్తూ, మెట్లు దిగి భవనం ముందుకు వచ్చేశాడు. అక్కడ ఆయుధ ధారులైన భటులు—నాలుగైదు వందల మంది సోలుపులుగా నిలబడి వున్నారు. వారి పక్కనే అశ్వారూఢులైన కొందరు రౌతులు పెద్ద పెద్ద యీటెలు చేబూని సర్వసన్నద్ధంగా వున్నారు.

చంద్రవర్మ ఓ యాభైమంది భటులనూ, పదిమంది ఆశ్వికులనూ రాజప్రాసాద రక్షణకు నియోగించి, మిగతావారిని రెండు సమ భాగాలుగా విభజించి, ఒక భాగాన్ని సేనాని ధీరమల్లుడికి ఒప్పచెపుతూ, ''సేనానీ, నేను కోటద్వారాలు దాటి రాజమార్గం మీదికి వెళ్ళగానే తూర్పుదిక్కుకు తిరుగుతాను. నువ్వు నీ భటులతో పడమటి దిక్కుకు వెళ్ళటం మంచిది. ఇద్దరం ఆ విధంగా శత్రు




సైన్యాన్ని ఛేదించుకుంటూ, అర్ధచంద్రాకారంగా తిరిగి, ఉత్తర ద్వారాన్ని చేరుకుందాం. ఒకవేళ....దైవనిర్ణయం మరో విధంగా వుంటే, అప్పటి పరిస్థితులకు అనుగుణంగా వుండే నిర్ణయాలు ఎవరికివారంగా చేసుకోవటం తప్ప మరో మార్గం లేదు," అన్నాడు.

"చిత్తం, యువరాజా! మీరుమాత్రం అనవసర ప్రమాదాలకు లోనుకాకండి. ఈ చీకటి మాటున శత్రువుల బలం ఎంతటిదో తెలియటంలేదు," అన్నాడు ధీరమల్లుడు.

ఆ వెంటనే రెండు సైన్య విభాగాలూ, 'సూర్యవర్మ మహారాజుకూ, జై!' అంటూ ప్రాసాద ప్రాంగణం దాటి పట్టణంలోకి ప్రవేశించినై. అప్పటికి తూర్పుదిక్కు తెలతెలవారుతున్నది. సాయుధుడై గుర్రం మీద వున్న సుబాహుడు, చంద్రవర్మకు ఆ దాపులనే తగలబడుతున్న గృహాలను చూపిస్తూ, "యువరాజా! సర్పకేతుడు తన కుటిల యత్నంలో కొంతవరకు విజయం సాధించాడు. అతడి పక్షాన పట్టణంలో ప్రవేశించిన వారిలో సుశిక్షితులైన సైనికులు బహు కొద్దిమంది. ఎక్కువ భాగం దోపిడీకోసం వచ్చిన పల్లెవాసులు. మనం నిర్దయగా వాళ్ళలో కొందరినైనా హతమార్చ గలిగితే, తతిమ్మావాళ్ళు ప్రాణాలు అరచేత బట్టుకుని నగరం వదిలిపారిపోతారు. అలాచేద్దామంటారా?" అన్నాడు.

చంద్రవర్మకు యీ ఆలోచన బాగానే వున్నట్టు తోచింది. అతడు తన వెంట వున్న అశ్వికులను హెచ్చరించి, పెద్దగా జైజై నినాదాలు చేస్తూ, కాగడాలు పట్టుకుని యిటూ అటూ పరిగెత్తుతున్న దోపిడీదారుల మీదికి వురికాడు. మరుక్షణంలో అశ్వికుల చేత గల ఈటెలు దోపిడీదార్ల వెన్నుల్లోనూ, గుండెల్లోనూ బలంగా గుచ్చుకున్నై. ఆ వెంటనే, "సూర్యవర్మ సైనికులు, సూర్యవర్మ సైనికులు!" అంటూ ఆ ప్రాంతమంతా

గగ్గోలు బయలుదేరింది. మరుక్షణమే రాజమార్గం ప్రక్కల అటూ యిటూ వున్న సందు గొందుల నుంచి, "సూర్యవర్మ సైనికులా? ఎక్కడ? ఎక్కడ?" అన్న పెద్ద పెద్ద కేకలతో పాటు పరిగెత్తి వస్తూన్న గుర్రాల గిట్టల చప్పుడు కూడా స్పష్టంగా వినబడింది.

శత్రుసైనికులను హతమార్చేందుకు చంద్రవర్మకు అది మంచి అదనుగా కనబడింది. అతడు తన భటులలో సగం మందిని, శత్రుసైనికులు వస్తున్న గొందికి అటువైపుగా నిలబెట్టి, తక్కిన సగం మందితో రెండవ వైపున నిలబడ్డాడు. రాజమార్గం చేరేందుకు ముందు వెనుకలు చూడకుండా వస్తున్న శత్రుఅశ్వికులను, వచ్చినవారిని వచ్చినట్టు యిరువైపుల నుంచీ ఎదుర్కొని తెగటార్చాలని చంద్ర వర్మ వ్యూహం.

అతడి వ్యూహం పారింది. మితిమీరిన విజయోత్సాహంలో సర్పకేతుడి సైనికులు రాజమార్గం మీద ఏమున్నదో చూసుకో కుండా, గొందిలో నుంచి వేగంగా రాజమార్గం చేరేందుకు ప్రయత్నించారు. ఇరు వైపులా సర్వసన్నద్ధంగా వున్న చంద్రవర్మ భటులు వచ్చిన వారిని వచ్చినట్టు తమ ఈటెలతో పొడవసాగారు. అక్కడ జరుగుతున్న బీభత్సాన్ని గుర్తించి,



వెనుదిరిగి పారిపోయే లోపలే, శత్రువుల్లో ఎక్కువ భాగం చంద్రవర్మ భటులచేత నిర్దయగా హతమార్చబడ్డారు.

ఈ విజయంతో చంద్రవర్మ భటులలో ఎక్కడ లేని ఆత్మవిశ్వాసం కలిగింది. వాళ్ళు ఒక్కుమ్మడిగా, 'సూర్యవర్మ మహారాజుకూ, జై' అంటూ రాజమార్గం మీద కనబడిన ప్రతి శత్రుసైనికుణ్ణీ, బందిపోటునూ వెంటాడి తమ ఈటెలతో, కత్తులతో పొడవసాగారు. పట్టణ ప్రజలు కూడా, తమ యువరాజు భటులతో రావటం గుర్తించి, దొరికిన ఆయుధమల్లా చేబూని, శత్రువుల మీద విరుచుకు బడ్డారు.

కొద్దిసేపట్లో చంద్రవర్మ, ఎదురుపడిన శత్రువులనెల్లా హతమారుస్తూ అమిత వేగంతో ఉత్తర ద్వారం సమీపించాడు. పడమటివైపుగా శత్రుసంహారానికి బయలు దేరిన సేనాని ధీరమల్లుడు కూడా అతనికి అల్లంత దూరంలో కనిపించాడు. కానీ, అతని వెనుక భాగాన పెద్ద ఆశ్వికదళం ఒకటి కదులుతూండటం చంద్రవర్మ కంటబడింది.

చూస్తూండగానే ధీరమల్లుడు తన ఆశ్వికులతో చంద్రవర్మను సమీపించి, "యువరాజా! మనం వెంటనే రాజ ప్రాసాద దుర్గం చేరటం మంచిది. సర్ప కేతుడు స్వయంగా మరికొంత సైన్యంతో పట్టణం ప్రవేశించాడు. అసంఖ్యాకులైన ఆ శత్రుసైనికులతో స్వల్ప సంఖ్యలోవున్న మనం ముఖాముఖిని తలపడటం ఆత్మ హత్యతో సమాన మవుతుంది! దుర్గరక్షణల ఆసరాతో పోరాడదాం. ఈ లోపల సరి హద్దులలో వున్న మన సైన్యం సహాయం రావచ్చు," అన్నాడు.

సర్పకేతుడు మరికొంత సైన్యంతో పట్టణం ప్రవేశించాడనే వార్త చంద్ర వర్మకు పిడుగుపాటులా తోచింది. దీని అర్థం, అతడు మాయోపాయాన్ని పరిత్య జించి, ప్రత్యక్షంగా దండోపాయానికి పూనుకున్నాడన్న మాట!

చంద్రవర్మ తన అశ్వాన్ని గిరుక్కున వెనక్కు తిప్పాడు. సుబాహుడూ, ధీర మల్లుడూ, తమ తమ గుర్రాలను అతడికి యిరువైపులా నడిపారు. భటులు వెంట రాగా అందరూ అతి వేగంగా ప్రాసాదం కేసి బయలుదేరారు. దారిలో ఎక్కడా వారిని శత్రువులు ఎదుర్కోలేదు. కాని, వారందరూ ప్రాసాద ప్రాంతాన్ని సమీపించే సరికి, దాని ముఖద్వారం ముందు శత్రు పదాతి సైనికులూ, ఆశ్వికులూ కని పించారు. వాళ్ళందరూ ద్వారాలను బద్దలుకొట్టేందుకు ప్రయత్నిస్తున్నారు. అది చూసి చంద్రవర్మ భీకరంగా గర్జిస్తూ తన భటులతో ఒక్కుమ్మడిగా వాళ్ళమీద విరుచుకు పడ్డాడు. —(ఇంకావుంది)






# పరివర్తన

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఇంత అర్ధరాత్రివేళ, ఈ భయంకర శ్మశానంలో, నువ్వు పడుతున్న శ్రమ చూస్తూంటే జాలికలుగుతున్నది. రాజైనవాడు తాను సాధించదలచిన కార్యాలను భృత్యుల ద్వారా సాధించవచ్చు. అయినా, నువ్వే స్వయంగా యింత కఠోరదీక్షతో సాధించదలచినదేమిటి? తీరా పనిసానుకూలమయ్యాక, సౌగంధదేశపు యువరాజు లాగా, చిత్తభ్రమ కలిగినవాడి ఘోరణిలో ప్రవర్తించవు గదా? ఆ యువరాజు వింతకథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ యిలా చెప్పసాగాడు :

## బేతాళ కథలు



సౌగంధదేశపు యువరాజు పేరు రూపసేనుడు. అతడు గురువుల నుంచి రాజోచితమైన అన్ని విద్యలూ నేర్చుకున్నాడు. ముఖ్యంగా లలితకళలంటే అతడి కెంతో ప్రీతి. పోతే, అతడిలో ఒకే ఒక లోపం వున్నది; అది వల్లమాలిన కోపిష్టితనం. కోపం వచ్చినప్పుడు అతడు ఏవో దుందుడుకు పనులు చేస్తుండేవాడు. కొడుకు ప్రవర్తన చూసి వృద్ధరాజు గుణసేనుడు, అతడి భవిష్యత్తు గురించి విచారిస్తూండేవాడు.

ఒకనాడు రూపసేనుడు ఉద్యానంలో విహరిస్తూండగా, కొంచెం దూరం నుంచి మధురగీతం ఒకటి వినవచ్చింది. అతడు ఎంతో ఆసక్తితో ఆ పాట విని, అది పూర్తి కాగానే, పాడిన వ్యక్తిని తన దగ్గిరకు తీసుకురమ్మని భటులను పంపాడు. ఆ వ్యక్తి మహారాణి యిష్టసఖి చంద్రావతి.

రూపసేనుడు, ఆమెను, ''చంద్రావతీ, నువ్వింత బాగా పాడగలవని, యీనాటి వరకూ నాకు తెలియదు! ఇంతకూ పాట నువు స్వయంగా రాసినదా?'' అని ప్రశ్నించాడు.

చంద్రావతి వినయంగా, ''నేను ఒక సంగీత విద్వాంసుడు పాడుతూండగా విని నేర్చుకున్నాను,'' అన్నది.

''అలాగా! ఇంత మధురంగా స్వరబద్ధం చేసిన, ఆ విద్వాంసుణ్ణి చూసి తీరవలసిందే,'' అని రూపసేనుడు, చంద్రావతి ద్వారా, మర్నాడు ఆ విద్వాంసుణ్ణి రప్పించాడు.

రూపసేనుడు విద్వాంసుడికి సత్కారాలు చేసి, తరవాత ఆయనను, ''ఆర్యా, మీరింత మధురంగా సంగీతం సమకూర్చిన పాట, సాహిత్యం కూడా అసమానంగా వున్నది. అది తమరు రాసినదేనా?'' అని అడిగాడు.

దానికి విద్వాంసుడు, ''కాదు, ప్రభూ! నా మిత్రుడొకడు కవి. అతడు రాసిన గీతానికి నేను సంగీతం సమకూర్చాను,'' అన్నాడు.

రూపసేనుడు ఆ కవిని ఆహ్వానించి ఘనంగా సత్కరించాడు. కవి అతడితో, "ఆ గీతాన్ని నేనంత మధురంగా రాయగలిగానంటే, ఆ ఘనత నాది కాదు, ప్రభూ! వసంతమిశ్రుడనే చిత్రకారుడిది. అతడు చిత్రించిన ఒక చిత్రంలోని యువతి అద్భుతమైన సౌందర్యానికీ, సౌకుమార్యానికీ, ముఖంలో కనబడే సంస్కారానికీ ముగ్ధుడనై, ఆ గీతం రాశాను," అన్నాడు.

ఒక కవిని అంతగా ఆకర్షించిన చిత్రంతో సహా, చిత్రకారుణ్ణి తీసుకు రమ్మని రూపసేనుడు భటులను పంపాడు. చిత్రకారుడు వచ్చాడు. రూపసేనుడు అతడు తెచ్చిన చిత్రం కేసి చూసి, ఒక క్షణకాలం నిశ్చేష్టుడై "వసంతమిశ్రా! ఈ చిత్రంలోని యువతి సజీవసుందరా, లేక నీ ఊహాకల్పనా?" అని అడిగాడు.

అందుకు వసంతమిశ్రుడు, "సజీవ సుందరే, ప్రభూ! ఆమె సువర్ణపుర జమీందారు ఏకైక పుత్రిక స్వర్ణమంజరి. నేను ఆమెను ఒక దేవాలయంలో చూసి, ఆ సౌందర్యాన్ని మరిచిపోలేక యిలా చిత్రించాను," అన్నాడు.

ఆ సమాధానానికి రూపసేనుడు పరమానంద భరితుడై, స్వర్ణమంజరి కోసం భటుల్ని పంపించాడు. ఊహించని విధంగా వాళ్ళు—స్వర్ణమంజరికి వారం క్రితమే వివాహమై, అత్తవారింటికి వెళ్ళిపోయినట్టు సమాచారం తెచ్చారు.





ఆ మాట వినగానే విపరీతమైన ఆశాభంగానికి గురైన రూపసేనుడు, వెంటనే అంతులేని కోపంతో, చంద్రావతినీ, సంగీత విద్వాంసుణ్ణీ, కవినీ, వసంతమిశ్రుణ్ణీ ఖైదు చేయించాడు. వాళ్ళు పొందిన భావావేశాలే, తనకు యింతటి నిరాశా వేదనలు కలగటానికి కారణం అయాయన్న అతడి మూర్ఖవాదనకు, ఎవరూ సమాధానం చెప్పలేకపోయారు.

ఒక సంవత్సరం గడిచింది. రూపసేనుడు జరిగినదానిని పూర్తిగా మరిచిపోయాడు. కాని, అతడి కోపావేశానికి గురైన నిర్దోషులు మాత్రం చెరసాలలోనే మగ్గుతున్నారు.

సౌగంధదేశం పక్కనే, జయంత దేశం వున్నది. ఆ దేశపురాజు ఏటేటా ఘనంగా వసంతోత్సవాలు జరిపిస్తాడు. ఆయన పంపిన ఆహ్వానం అందుకుని, రూపసేనుడు అక్కడికి వెళ్ళాడు. ఆ ఉత్సవాల్లో ఒక రోజు అద్భుతంగా సంగీత కచేరీ చేసిన ఒక యువతి, తన గాత్రంతోనూ, ముఖభంగిమలతోనూ అతణ్ణి అమితంగా ఆకట్టుకున్నది.

ఆమె ఎవరన్న రూపసేనుడి ప్రశ్నకు, జయంతదేశపు యువరాజు సమాధానం చెబుతూ, "ఆమె మీ దేశపు యువతే, రూపసేనా! పేరు స్వర్ణమంజరి. సువర్ణపుర జమీందారు కుమార్తె. మా దేశపు వాడైన నవీనుడనే గాయకుణ్ణి పెళ్ళాడి, యిక్కడికి వచ్చింది. సుగుణాల రాశి, మధురగాయని," అన్నాడు.

రూపసేనుడికి గతమంతా ఒక్కసారి గుర్తుకొచ్చింది. క్షణకాలం పాటు అతడు తీవ్రమైన కోపావేశానికి లోనయాడు. కాని, అవతలి వ్యక్తి స్త్రీ కావడం— అందునా వివాహిత కావడం, అతడి కోపానికి అనకట్ట అయింది.

పాటకచేరీ ముగిసిన తరవాత అతడు, స్వర్ణమంజరితో మాట్లాడాలన్న కుతూహలం కనబరిచాడు. భర్త వెంటరాగా ఆమె వచ్చి, రూపసేనుడితో కొద్దిసేపు

మాట్లాడింది. ఆ కొద్దిసేపటిలోనూ, అతడి మనసు అతడికే ఆశ్చర్యం కలిగేలా మారిపోయింది. స్వర్ణమంజరి మృదుభాషణ, ఆమె ముఖంలో, నడవడికలో కనిపించే స్వచ్ఛత, సంస్కారం ఆమె రూప లావణ్యానికి మరింత వన్నెతెస్తున్నది.

ఆ రోజే రూపసేనుడు తన రాజ్యానికి తిరుగుప్రయాణం అయ్యాడు. అతడు రాజధాని చేరుతూనే మొదట చేసిన పని, తను ఖైదు చేసిన వసంతమిశ్రుడు మొదలైన వాళ్ళందరినీ విడుదల చేయడం. అంతేకాక, వాళ్ళను సగౌరవంగా సభకు ఆహ్వానించి విలువైన కానుకలతో సత్కరించాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, రూపసేనుడి వింతప్రవర్తన గురించి, నీ అభిప్రాయం ఏమిటి? ఆశించిన స్త్రీ దక్కనందుకు అన్యాయంగా వసంతమిశ్రుడూ వాళ్ళను ఖైదు చేసిన అతడు, ఆమె కనబడగానే వాళ్ళను విడుదల చేసి సత్కరించడమేమిటి? అతడిలో వచ్చిన యింత మార్పుకు, అతడి చిత్తభ్రమే కదా కారణం? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రూపసేనుడిలో పూర్వజన్మ సంస్కారం వున్నది. కాని, అది మబ్బులచాటున చంద్రుడిలా, అతడి కోపపు నీడలో మరుగుపడింది. మబ్బులు దట్టంగా కమ్మినప్పుడు, ఒక్కొకసారి పిడుగులతో వర్షం పడినట్టే, అతడి కోప తీవ్రత ఎవరినో ఒకరిని బాధించింది. తీవ్రమైన సూర్యకిరణాలు మబ్బులను మటుమాయం చేసినట్టే, స్వర్ణమంజరిలోని పవిత్రత అతణ్ణి ఆకర్షించి పునీతుణ్ణి చేసింది. అతడిలో కలిగిన ఈ పరివర్తన చిత్తసంస్కారం అనిపించుకుంటుందిగాని, చిత్తభ్రమ అనిపించుకోదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)






కోసలరాజధానీ నగరానికి సమీపంలోని, ఒక అరణ్యంలో కమలానందుడనే మహా పండితుడొకాయన వుండేవాడు. అయన అన్ని శాస్త్రాల్లోనూ గొప్ప పాండిత్యం కలవాడు. శ్రీమంతుల పిల్లలేకాక, మహా రాజుల వంశస్థులు కూడా ఆయన వద్దకు విద్యాభ్యాసం కోసం వస్తూండే వాళ్ళు.

ఇతర పండితులలో లేని ఒక ప్రత్యేక లక్షణం కమలానందుడిలో వుండేది. ఆయన విద్యాబోధనలో ఎన్నడూ దేవుడి ప్రసక్తి తెచ్చేవాడు కాదు. ఎవరైనా శిష్యుడు దేవుణ్ణి గురించీ, దైవభక్తిని గురించీ ప్రశ్నిస్తే, అది నువ్వు భావిజీవితంలో ఎదుర్కొబోయే సమస్యలకు సంబంధించినది కాదు. నువ్వు జీవితంలో అభివృద్ధికి రావాలంటే—నీ విజ్ఞానం, తెలివి తేటలూ, సమయస్ఫూర్తీ మాత్రమే తోడ్పడగలవు, అనేవాడు.

ఆయన శిష్యులలో యిద్దరు రాజకుమారులుండేవారు. వాళ్ళల్లో ఒకడు చంద్రసేనుడు; అతను మణిపురం రాజకుమారుడు. రెండవవాడు సూర్యసేనుడు; అతను నాగపురం రాజకుమారుడు. కొంత కాలానికి యిద్దరూ చదువు ముగించుకుని, ఆయా దేశాలకు రాజులయ్యారు.

ఒకసారి కమలానందుడు తన శిష్యుల రాజ్యపాలన ఎలావున్నదో తెలుసుకునేందుకు బయలుదేరాడు. వెంట ఆయన ప్రధాన శిష్యుడైన రామదాసు వున్నాడు. ముందుగా ఆయన మణిపురానికి వెళ్లాడు. నగరంలో ఎక్కడ చూసినా దేవాలయాలు కనిపించినై. వాటి ముందున్న పెద్ద పెద్ద పందిళ్ళకింద బీదసాదలకు అన్నదానాలు జరుగుతున్నవి.

రాజు చంద్రసేనుడు, కమలానందుడికి సకలమర్యాదలూ చేశాడు. కమలా

పెంటకోట సోమినాయుడు

నందుడు చంద్రసేనుణ్ణి, "నాకు నీ నగరంలో ఎన్నో దేవాలయాలు కనిపించినై. నీలో దేవుడున్నాడన్న నమ్మకం చాలా బలీయంగా వున్నట్టున్నది. అవునా ?" అని అడిగాడు.

"నాకు అలాంటి నమ్మకంలేదు," అన్నాడు చంద్రసేనుడు.

"అయితే, ఈ గుళ్ళూ గోపురాల మాటేమిటి ?" అని ప్రశ్నించాడు కమలానందుడు.

"నా ప్రజలకు వాటిలో నమ్మకమున్నది, గురుదేవా!" అని జవాబిచ్చాడు చంద్రసేనుడు.

కమలానందుడు అక్కడి నుంచి నాగపురాన్నేలే సూర్యసేనుణ్ణి చూడబోయాడు. నగరంలో ఒక్కగానొక్క దేవాలయమైనా, ఆయన కంటపడలేదు. ఆయన కొందరు ప్రజల్ని, "మీకు దేవుడున్నాడన్న నమ్మకం లేదా ?" అని అడిగాడు.

"మాకు నమ్మకం వున్నది. కాని, మా మహారాజుకు అలాంటి నమ్మకం లేదు," అని వాళ్ళు జవాబిచ్చారు.

రాజు సూర్యసేనుడు కూడా కమలానందుడికి అన్ని మర్యాదలూ చేశాడు. ఆయన తన శిష్యుడి యోగక్షేమాలు విచారించి, తన గురుకులానికి తిరిగి వచ్చాక ప్రధాన శిష్యుడైన రామదాసును, "చంద్రసేన, సూర్యసేనుల్లో ఎవరు ఉత్తమ శిష్యులని, నీ అభిప్రాయం?" అని అడిగాడు.



"నిస్సందేహంగా సూర్యసేనుడే, మీ ఉత్తమ శిష్యుడు," అన్నాడు రామదాసు.

"ఎందువల్ల?" అని ప్రశ్నించాడు కమలానందుడు.

"చంద్రసేనుడు తనకు దేవుడిలో నమ్మకం లేదన్నాడు. కాని, అందుకు విరుద్ధంగా అతడి నగరంలో అసంఖ్యాక మైన దేవాలయాలున్నవి. సూర్యసేనుడి రాజధానిలో మనకు ఒక్కగానొక్క దేవాలయమైనా కనిపించలేదు. కనక, సూర్యసేనుడే మీ ఉత్తమ శిష్యుడు," అన్నాడు రామదాసు.

కమలానందుడు ఒకటి, రెండు క్షణాలు మౌనంగా వూరుకుని, "నేను శిష్యులకు విద్యబోధించేటప్పుడు, ఏనాడూ దేవుడి ప్రసక్తితేలేదు. వాళ్ళకైవాళ్ళు ప్రశ్నించి నప్పుడు మాత్రం, తగువిధంగా జవాబిచ్చే వాడిని. చంద్రసేనుడూ, సూర్యసేనుడూ కూడా నన్ను సరిగా అర్థం చేసుకోలేదు. అందువల్లనే వాళ్ళు తమ, తమ దేశాల్లో దేవాలయాలు వుండడం, లేకపోవడం అనేదాన్ని ముఖ్య సమస్యగా తీసుకు న్నారు. అయితే, ఇందులో వాళ్ళు భిన్న మార్గాలు చేపట్టారు. సూర్యసేనుడికి దేవుడిలో నమ్మకం లేదు; కాని అతడి పాలనలో వున్న ప్రజలకు ఆ నమ్మకం వున్నది. ఒక దేశానికి రాజుగా అతడు ప్రజల యిష్టానుసారం పరిపాలన చేయడం ధర్మం. అతడు అలా చేయక, అధికారబలంతో తన అభిప్రాయాలను ప్రజల మీద అమలు చేస్తున్నాడు. అది సరికాదు," అన్నాడు.

"మరి చంద్రసేనుడి మాటేమిటి?" అని అడిగాడు రామదాసు.

"అతడు ప్రజల అభిమతాన్ని అను సరించి రాజ్యపాలన చేసే రాజు. ప్రజల నమ్మకాన్ని కాదనక దేవాలయాలు కట్టించి, అక్కడ పేదలకు అన్నదానం చేయించి ఆదుకుంటున్నాడు. అది ఉత్తమ రాజలక్షణం. అందువల్ల అతడే, నా ఉత్తమ శిష్యుడు," అన్నాడు కమలానందుడు.






# మంత్రి బాధ్యత

ఆనందగిరి సింహాసనాన్ని, కుమారవర్మ అధిష్ఠించేనాటికి, దేశం ఆర్థికపరిస్థితి ఏమీ బాగా లేదు. అంతకు ముందు శత్రు రాజులతో ఆయన తండ్రి చేసిన యుద్ధాల కారణంగా ఖజానా పూర్తిగా ఖాళీ అయిపోయింది.

కుమారవర్మ, తన మంత్రి ముకుళ శర్మతో సంప్రతించి, ప్రజల మీద వీలైనన్ని కొత్త పన్నులు విధించాడు. ఎలాంటి తప్పని పరిస్థితుల కారణంగా, యీ పన్నులు వేయవలసి వచ్చిందో, ఆయన స్వయంగా ప్రజలకు తెలియబరుస్తానన్నాడు.

ఇందుకు ముకుళశర్మ, "కొత్త పన్నులు వేసిన సంగతి మీరు స్వయంగా ప్రకటించకూడదు. ఈ పని రాజోద్యోగులకు వదిలిపెట్టండి," అని సలహా యిచ్చాడు.

మంత్రి పరిపాలనాదక్షత గురించి ఎరిగి వున్నవాడు కావడం వల్ల, కుమారవర్మ అందుకు ఒప్పుకున్నాడు.

కొన్నాళ్ళు గడిచినై. ఒకనాటి రాత్రి రాజూ, మంత్రీ తమ పరిపాలన గురించి ప్రజలేమనుకుంటున్నారో తెలుసుకోవాలని, మారువేషాల్లో రాజధానీ నగరంలో సంచారం చేస్తున్నారు.

అది చలికాలం. ఒక చోట కొందరు చలిమంట చుట్టూ కూర్చుని మాట్లాడుకుంటూండడం వాళ్ళ కంటబడింది. రాజూ, మంత్రీ వాళ్ళ పక్కన చేరి కూర్చున్నారు.

చలికాగుతున్నవాళ్ళు మాట్లాడుకుంటున్నది, రాజు కొత్తగా వేసిన పన్నులను గురించే. వాళ్ళల్లో ఒక ముసలివాడు, "మనం యిప్పుడు చెల్లిస్తున్నంత పెద్ద పన్నులు, లోగడ యీ రాజ్యంలో ఏనాడూ

కమలిని




రాజు కొంచెం సేపు ఆలోచించి, "ఏది ఏమైనా ప్రజల్లో అసంతృప్తి పెరుగుతున్న దని స్పష్టంగా తెలుస్తున్నది. ఇప్పుడు చేయదగినదేమిటో మనంనిర్ణయించాలి," అన్నాడు.

మంత్రి అవునన్నట్టు తల వూపి, "తమరేమీ ఆదుర్దాపడవలసిన అవసరం లేదు. మన ఖజానా యిప్పుడు పుష్కలంగా నిండింది. ఈ సంగతి నిన్ననే నాకు కోశాధిపతి చెప్పాడు. మీరు సమ్మతించితే, తక్షణం మనం కొత్త పన్నులన్నిటినీ రద్దు చేయవచ్చు," అన్నాడు.

కుమారవర్మ సంతోషంగా, "ఈ మాట ముందే చెప్పారు కాదేం! కొత్త పన్నులన్నీ రద్దయిపోయినట్టు, రాజోద్యోగుల ద్వారా ప్రజలకు వెంటనే తెలియ పరచండి," అన్నాడు.

ఆ మాటలకు మంత్రి ముకుళశర్మ చిన్నగా నవ్వి, "ప్రభూ, యీ పన్నుల రద్దు విషయం, తమరే స్వయంగా ప్రజలకు తెలియజెప్పడం, ఎంతో ప్రయోజనకరంగా వుంటుంది," అన్నాడు.

రాజు ఆశ్చర్యంగా మంత్రి కేసి చూశాడు.

అప్పుడు మంత్రి, "అవును, ప్రభూ! కొత్త పన్నులు ఎందుకు విధించవలసి వచ్చిందో, తమరు స్వయంగా ప్రజలకు

చెల్లించలేదు. యీ పన్నులకు ఒక హద్దూ పద్దంటూ లేకుండా పోయింది. రాజోద్యోగులు జనాన్ని అదిరించీ, బెదిరించీ మరీ పన్నులు వసూలు చేసుకుపోతున్నారు," అంటూ కొత్త పన్నులు కట్టలేక ప్రజలు పడుతున్న అవస్థల గురించి చెప్పుకు పోసాగాడు.

కొంచెం సేపు అక్కడ కూర్చుని రాజూ, మంత్రీ తిరిగి బయలుదేరారు.

మంత్రి, రాజుతో, "చూశారా, ప్రభూ! పన్నులు విధించింది మీరైనా, ప్రజల ఆగ్రహం మాత్రం వాటిని వసూలు చేస్తున్న రాజోద్యోగుల మీదికి మళ్ళింది," అన్నాడు నవ్వుతూ.

చెబుతానన్నప్పుడు, వద్దని వారించాను. తమది ఎంతటి సదుద్దేశమైనా—కొత్తగా పన్నులు కట్టమనడం, ప్రజలకు ఒక దుర్వార్త వినిపించడం లాంటిది,'' అన్నాడు.

''అయినా, రాజోద్యోగులు ఎలాగో ఒకలాగు ప్రజల నుంచి కొత్త పన్నులు వసూలు చేశారు,'' అన్నాడు రాజు.

''అందువల్లనే ప్రజల అసంతృప్తికి మీరు కాక, వాళ్ళు గురయ్యారు. అలా కాక, మీరే స్వయంగా కొత్త పన్నులు ప్రకటించి వుంటే, సింహాసనం ఎక్కిన తొలిరోజుల్లోనే ప్రజలు మీపట్ల అసంతృప్తి చెందేవారు,'' అన్నాడు మంత్రి.

''మీరు చెప్పింది చాలా యుక్తియుక్తంగా వున్నది. మరి యిప్పుడు, ఆ కొత్త పన్నుల రద్దు విషయం, నేనే ఎందుకు స్వయంగా ప్రజలకు తెలియ చెయ్యాలి?'' అని అడిగాడు రాజు.

''ఈ పన్నుల రద్దు, ప్రజలకు ఒక శుభవర్తమానం లాంటిది. అది, మీ ద్వారా జరిగినప్పుడు, మీ ప్రతిష్ఠ ఎంతగానో యినుమడిస్తుంది. అందువల్ల రాజ్యపాలకులు ప్రజలకు అసంతృప్తి కలిగించే నిర్ణయాలు చేసినప్పుడు, వాటి అమలు బాధ్యత, కింది ఉద్యోగులకు విడిచిపెట్టాలి. అలాగే, ప్రజలు హర్షించే నిర్ణయాలన్నిటినీ, తామే స్వయంగా ముందుకు వచ్చి ప్రకటించాలి. ఇలాంటి మంత్రాంగాలతో, తమ పరిపాలనను ఏ ఒడిదుడుకులు లేకుండా నడిపించడం, మంత్రిగా నా బాధ్యత కదా!'' అన్నాడు ముకుళశర్మ.

తన మంత్రి ప్రతిభనూ, విజ్ఞతనూ కుమారవర్మ తన మనసులోనే ఎంతగానో అభినందించి, మర్నాడు ప్రజల హర్షధ్వానాల మధ్య, రాజ్యంలో తాను కొత్తగా విధించిన పన్నులన్నీ రద్దుచేస్తున్నట్టు ప్రకటించాడు.

ఈ విధంగా ఎంతోసమర్థుడైన ముకుళశర్మ యిచ్చే చక్కని సలహాలను పాటిస్తూ, కుమారవర్మ ఆనందగిరి రాజ్యాన్ని ఎన్నో ఏళ్లు ప్రజానురంజకంగా పరిపాలించాడు.





# లోకం తీరు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు కృష్ణద్వైపాయనుడనే ధనిక బ్రాహ్మణుడుగా కౌశాంబీ నగరంలో జన్మించాడు. ఆయన పెరిగి పెద్ద అయాక లౌకిక వాంఛలవల్ల కలిగే అనర్థాలను గుర్తించినవాడై, తనకు గల యావదాస్తినీ దానధర్మాల కింద ఖర్చుపెట్టేసి, సన్యాసం అవలంబించి, యాభై ఏళ్ళపాటు హిమాలయ పర్వతాలలో తపస్సు చేసుకుంటూ గడిపాడు. కాని, ఆకులూ అలములూ తింటూ శరీరాన్ని అనేక బాధలకు గురిచేస్తూ సాగించిన ఈ తపస్సు ఆయనకు సిద్ధించలేదు.

అటుపైన కృష్ణద్వైపాయనుడు హిమాలయాలను వదిలి, తీర్థయాత్రలు చేస్తూ కాలక్రమాన కాశీరాజ్యానికి వచ్చాడు. అక్కడ ఆయనకు బాల్యమిత్రుడొకాయన, మాండవ్యుడు అనేవాడు, ఒక గ్రామంలో కనిపించి అతిథ్యం ఇచ్చాడు. మాండవ్యుడు కృష్ణద్వైపాయనుణ్ణి తన వద్దనే ఉండమని కోరాడు; ఆయన నిమిత్తం చక్కని పర్ణకుటీరం ఒకటి కట్టించి, ఆయన అవసరాలన్నిటినీ తాను యథావిధిగా గడుపుతూ వచ్చాడు.

ఒకనాడు, మాండవ్యుడి కుమారుడు, యజ్ఞదత్తుడనేవాడు, బంతితో ఆడుతూ ఉండగా ఆ బంతి వెళ్ళి ఒక పాము నివసిస్తున్న పుట్టలో పడింది.

ఈ సంగతి తెలియక యజ్ఞదత్తుడు బంతి తీసుకోవటానికై పుట్టలో చెయ్యి పెట్టాడు. వెంటనే వాడి చేతిని పాము కరిచింది. త్వరలోనే పాము విషం వంటికి ఎక్కి యజ్ఞదత్తుడు స్పృహ లేకుండా పడిపోయాడు.

తమ కుమారుడు ఈ స్థితిలో పడి ఉండగా మాండవ్యుడు, ఆయన భార్యా



వాణ్ణి చూశారు. మాండవ్యుడు వెంటనే తన కుమారుణ్ణి చేతుల్లో ఎత్తుకుని, కృష్ణ ద్వైపాయనుడి కాళ్ళముందు పడేశాడు.

"బాబూ, మీ తపశ్శక్తిచేత వీణ్ణి బతికించి మాకు పుత్రభిక్ష పెట్టండి!" అని ఆ దంపతులు ప్రాథేయపడ్డారు.

కృష్ణద్వైపాయనుడికి ఏమి చెయ్యాలో తోచలేదు. మీరు "పొరపడుతున్నారు. నా దగ్గిర ఎట్టి శక్తులూ లేవు. నేను అంత కాలం తపస్సు చేశానేగాని, ఆ తపస్సు సిద్ధించలేదు. కనీసం నాకు మందూ మాకులూ అయినా తెలీవు. నేను మీకే విధంగా సాయం చెయ్యగలను? మీ పిల్లవాణ్ణి ఎలా బతికించగలను?" అన్నాడు.

"తపస్సు సిద్ధించకపోయినా అంత కాలం చేసిన తపస్సుకు ఫలితం ఉండక పోదు. మీరు సత్యప్రమాణం చెయ్యండి, కుర్రవాడు తప్పక బతుకుతాడు!" అన్నాడు మాండవ్యుడు.

కృష్ణద్వైపాయనుడు ఇందుకు సమ్మతించి, ఈ కింది శ్లోకం చదువుతూ సత్య ప్రమాణం చేశాడు:

"సత్తాహం ఏవాహం ప్రసన్నచిత్తో
పుఞ్ఞత్థికో అచరిం బ్రహ్మచరియం,
అథాపరం యం చరితం మమయిదం
వస్సాని పఞ్ఞాస సమాధికాని
అకామకో వా హి అహం చరామి,
ఏతేన సచ్చేన సువత్థి హోతు,
హతం, విసం, జీవతు యఞ్ఞదత్తో."

[నేను పుణ్యం కోరినవాణ్ణి అయి వారం రోజులపాటు నిర్మల చిత్తంతో బ్రహ్మచర్యం అవలంబించాను. తరువాత నేను యాభై ఏళ్ళపాటు చేసిన తపశ్చర్య చిత్తశుద్ధితో చేసినది కాదు. నేను చేసే ఈ సత్యప్రమాణం ఫలితంగా మేలు కలిగి, విషం విరిగి, యఞ్ఞదత్తుడు పూర్ణజీవుడౌ గాక!]

వెంటనే కుర్రవాడి వక్షస్థలం నుంచి కొంత విషం బయటికి వచ్చి నేలలో ఇంకి పోయింది. వాడు కళ్ళు తెరిచి తన తలిదండ్రుల కేసి ఒకసారి చూసి,



"అమ్మా!" అని మూలిగి, పక్కకు ఒత్తిగిలి తిరిగి మైకంలో పడిపోయాడు.

"చూశావు గదా ? విషం పూర్తిగా లాగి వెయ్యటం నాకు సాధ్యం కాలేదు. నీవు కూడా సత్యప్రమాణం చేసి చూడు, ఫలితం ఉండవచ్చు." అని కృష్ణ ద్వైపాయనుడు మాండవ్యుడితో అన్నాడు.

మాండవ్యు డిందుకు ఒప్పుకుని ఈ విధంగా సత్యప్రమాణం చేశాడు:

"యస్మా దానం న అభినందిం కదాచి
దిరవానాహం అతిథిం వా సకాలే
న చాపి మే అప్పియం అలేదుం
బహుస్సుతా సమణా బ్రాహ్మణాచ
అకామకో వా హి అహం దదామి,
ఏతేన సచ్చేన సువత్థి హెూతు,
హతం విసం, జీవతు యఞ్ఞదత్తో."

[నేను అతిథులను సత్కరించాను గాని, అది ఇష్టంతో కాదు. జ్ఞానులైన శ్రమణులూ, బ్రాహ్మణులూ నా ఆతిథ్యం ఇష్టం లేకుండా చేసినదేనని తెలుసుకోలేక పోయారు. నేను దానాలు కూడా ఇష్టం లేకుండానే చేశాను. నేను చేసే ఈ సత్య ప్రమాణం ఫలితంగా మేలు కలిగి, విషం విరిగి, యజ్ఞదత్తుడు పూర్ణజీవుడౌ గాక !]

మాండవ్యుడు ఈ విధంగా సత్య ప్రమాణం చెయ్యగానే యజ్ఞదత్తుడి వీపు నుంచి మరికొంత విషం బయటికి వచ్చి నేలలో ఇంకిపోయింది. కుర్రవాడు లేచి కూచోగలిగాడు గాని, నిలబడలేక పోయాడు. అప్పుడు మాండవ్యుడు తన భార్యకేసి తిరిగి ఇలా అన్నాడు.

"నీవు కూడా సత్యప్రమాణం చెయ్యరాదా? కుర్రవాడు లేచి ఎప్పటిలాగా తిరగ గలుగుతాడు."

"నేను ప్రకటించవలిసిన సత్యం కూడా ఉన్నది గాని, దాన్ని మీ ముందు ప్రకటించటానికి వీలులేదు," అన్నది మాండవ్యుడి భార్య విచారంగా.

"పిచ్చిదానా, ఎందుకు సందేహిస్తావు? మన కుర్రవాడికన్న ఎక్కువేమిటున్నది? సత్యప్రమాణం చెయ్యి," అని మాండ

వ్యుడు తన భార్యను ప్రోత్సహించాడు. అమె అందుకు ఒప్పుకుని ఈ విధంగా సత్యప్రమాణం చేసింది:

''అసో విసో తాత పహూత తేజో
యే తం అదట్టి పతరా ఇదచ్చి,
తస్మిం చ మే అప్పియతాయ అజ్జ
పితరి చ తే నత్థి కోచి విసేసో,
ఏతేన సచ్చేన సువత్థి హెూతు,
హతం విసం, జీవతు యంజ్ఞదత్తో.''

[నాయనా, ఇవాళ నిన్ను అ పుట్టలో నుంచి కాటువేసిన విషసర్పాన్ని చూస్తే నాకెంత అసహ్యమో, నీ తండ్రిని చూసినా అంత అసహ్యమే. నాకు ఈ ఇద్దరిలో తేడా ఏమీ కనిపించ లేదు. నేను చేసే ఈ సత్యప్రమాణం ఫలితంగా మేలు కలిగి, విషం విరిగి, యజ్ఞదత్తుడు వెంటనే పూర్ణజీవుడౌ గాక!]

ఈ సత్యప్రమాణంతో యజ్ఞదత్తుడి శరీరంలో నుంచి విషం పూర్తిగా బయటికి వచ్చి నేలలో ఇంకిపోయింది. వాడు లేచి ఎప్పటిలాగే అడుకోసాగాడు.

మాండవ్యుడు కృష్ణద్వైపాయనుడి కేసి తిరిగి, ''స్వామీ, మీరు ఉత్తమోత్తమమైన తపస్వి జీవితాన్ని స్వీకరించి కూడా దాన్ని ఇష్టం లేకుండా సాగించటానికి కారణమేమిటి?'' అని అడిగాడు.

అందుకు కృష్ణద్వైపాయనుడు, ''దానికి ఒకటే కారణం. ఒకసారి సన్యసించి వెళ్ళిపోయినవాడు తిరిగి సంసారంలోకి అడుగు పెడితే అందరూ హేళన



చేసి, మూఢుడని నిందిస్తారు! అందుచేత, ఆ జీవితం నాకు ఇష్టం లేకపోయినప్పటికీ అందరూ నన్ను గౌరవంగా చూడ గలందులకై నేను తపస్విగానే ఉండి పోయాను! మరి నీవు అతిథి అభ్యాగతు లకు ఇంత ఘనంగా ఆతిథ్యం ఇస్తావుగదా, ఆ పని అయిష్టంగా చెయ్యటానికి కారణ మేమిటి?'' అని అడిగాడు.

''నా తాతా, తండ్రీ జగత్ప్రసిద్ధి పొందిన దాతలు. అందుచేత నేను కూడా వారి మార్గమే అనుసరించవలిసి వచ్చింది. వారి కీర్తికి కళంకం తెచ్చానని జనం నన్ను ఆడిపోసుకోకుండా ఉండగలందు లకై నేను వితరణగా దాన ధర్మాలు చేశాను; నాకు వాటియందు ఏ మాత్రమూ ఇష్టం ఉండి కాదు,'' అని జవాబు చెప్పి, మాండవ్యుడు తన భార్య కేసి తిరిగి, ''పసితనంలోనే నాకు భార్యవై నా యింటికి వచ్చావు. ఇన్నేళ్ళుగా నాతో కాపురం చేశావు. నాపైన ప్రేమాభిమానాలు లేని ఈ జీవితం నీకెంతో రోత పుట్టించి ఉండాలి. దానిని ఎందుకు సహించావు?'' అని అడిగాడు.

దానికి మాండవ్యుడి భార్య, ''మన వంశంలో స్త్రీ తన భర్తతో కాపరం చెయ్యటం విధి గనక ఈ జీవితం భరిం చాను. నేను మిమ్మల్ని విడిచి వెళ్ళిపోయి మరొక భర్తను కట్టుకున్నట్టయితే లోక మంతా నన్ను కులటగా భావించి ఉండేది. మన అబ్బాయి క్షేమం కోరి మాత్రమే నేనీ విషయం బయటపెట్టాను!'' అన్నది.

''నిజం చెప్పినందుకు నేను నిన్ను తప్పుపట్టను. ఇకముందు నిన్ను ప్రేమతో చూస్తానని ప్రమాణం కూడా చేస్తున్నాను!" అన్నాడు మాండవ్యుడు తన భార్యతో.

''నీవు దానాలు చెయ్యదలిస్తే ఇష్టం తోనే చెయ్యిగాని, ఇష్టం లేకుండా చెయ్యకు. నేను కూడా ఇక మీదట ఈ తాపసి జీవితం మనస్ఫూర్తిగా సాగిస్తాను!" అంటూ కృష్ణద్వైపాయనుడు మాండవ్యుడి వద్ద సెలవు పుచ్చుకుని, తన దారిన తాను వెళ్ళిపోయాడు.






మన నదులు :

# యమున

మహాకవి కాళిదాసు 'దేవతాత్మ'గా, 'పర్వతరాజు'గా అభివర్ణించిన హిమాలయ పర్వతశిఖరాల నుంచే మన జీవనదులు చాలావరకు పుట్టి, ప్రవహిస్తున్నాయి. మన పురాణాలు నదులను కేవలం ప్రకృతి సహజంగా భావించడం లేదు; అవి నదులలో సజీవ ఆత్మలను సందర్శించాయి.

ఉదాహరణకు, యమునానదిని మన పురాణాలు—సూర్యునికీ, సంధ్యాదేవికీ జన్మించిన కుమార్తెగా చెబుతాయి. యముని తోబుట్టువు కావడం వల్ల ఆమె కాపేరు వచ్చింది. భూతలం మీద సృష్టిలో పాలు పంచుకునే ఉత్సాహంతో ఆమె నదీరూపం దాల్చిందట!





కాళిందపర్వత పాదతలంలో, హిమాలయాల మీద యమునోత్రి వద్ద యమున మనకు దర్శనమిస్తుంది. సముద్ర మట్టానికి, పదివేలా ఎనిమిది వందల అడుగుల ఎత్తున వున్న యమునోత్రి అద్భుతమైన ప్రదేశం. ఆ పవిత్ర ప్రదేశంలో యమునాదేవి ఆలయం కూడా ఉన్నది.




ప్రారంభంలో యమునా జలప్రవాహం సుడిగుండాలతో, మహా ఉధృతంగా వుండేది. దానిని సమీపించడానికి ఏ ప్రాణీ సాహసించేది కాదు. జలపాత ధ్వని వేయిసింహాల గర్జనలా, భయం కలిగించేది. జలపాతం నుంచి లేచే నీటి తుంపరలు, పొగలమేఘాల్లా చూపరులకు ఆశ్చర్యాద్భుతాలను కలిగించేవి.

ఒకనాడు కృష్ణుడి సోదరుడైన బల రాముడు, కొండల మీద తిరుగుతూ, యమునానది జలపాతాన్ని చూసి, అందులో స్నానం చెయ్యాలనుకు న్నాడు. జలపాతం దాపున, ఒక పెద్ద బండ మీద నిలబడి, నదిని దగ్గరకు రమ్మని పిలిచాడు.





బలరాముడి పిలుపును యమున ఏ మాత్రం లెక్కచేయలేదు. అతడు మళ్ళీ మళ్ళీ రమ్మని ఆజ్ఞాపించాడు. అయినా ప్రయోజనం లేకపోయింది. జల ప్రవాహంలోకి దూకాడు. ప్రవాహం అతణ్ణి దూరంగా నెట్టివేయడానికి ప్రయత్నించింది. బలరాముడికి తీవ్ర మైన కోపం వచ్చింది.

గట్టు మీదికి వచ్చి, తన నాగలిని యమునానదిలో గుచ్చి, కొండల గుండా, కోనలగుండా, మైదానాల గుండా, తన ఇష్టం వచ్చినట్టు వంకర టింకరగా లాక్కుని వెళ్ళాడు. యమునకు అతడి నాగేటిచాలును అనుసరించక తప్పిందికాదు.





ఆఖరికి యమున ఆత్మ స్త్రీరూపం ధరించి, ఇంతటితో తన్ను వదలిపెట్టమని, ఉగ్రుడైన బలరాముని ప్రార్థించింది. బలరాముడు శాంతించి, యమునను అంతటితో వదిలిపెట్టాడు. ఈ అనుభవంతో, యమున కాస్త నిదానంగా ప్రవహించ సాగింది.

పురాణ నగరాలైన హస్తినాపురం, ఇంద్రప్రస్థాల గుండా యమునానది ప్రవహించ సాగింది. కాలగతిలో కనుమరుగైన ఆ రెండు నగరాల పరిసరాల్లోనే ఈనాటి కొత్తఢిల్లీ ఏర్పడి ఉన్నది. చారిత్రక ప్రసిద్ధిగాంచిన ఎర్రకోట సమీపంలో, యమునానది ప్రవహిస్తున్నది.





పురాతన నగరమైన మధురను ఆసుకుని కూడా యమునానది ప్రవహిస్తున్నది. మధురానగరంలోని, రాక్షసరాజు కంసుని చెరసాలలోనే శ్రీకృష్ణుడు జన్మించాడు. శిశువుగా వున్న కృష్ణుని, అతని తండ్రి వసుదేవుడు మధుర నుంచి వ్రేపల్లెకు యమునానదిని దాటి తీసుకుపోయినప్పుడు, సర్పరాజు వాసుకి పడగవిప్పి, వాళ్ళు వానకు తడవకుండా గొడుగుపట్టింది.

యమునాతీర బృందావనంలోనే, కృష్ణుడు తన వేణుగానంతో పశుపక్ష్యాదులను, భక్తులను పరవశింపజేశాడు. కృష్ణుడి బాలక్రీడలతో, అత్యంత దగ్గరి సంబంధం వున్న నది యమున.






గంగా యమునల సంగమస్థానమైన పవిత్ర ప్రయాగ వద్దే, అంతర్వాహినిగా ప్రవహించే సరస్వతీనది కూడా గంగా నదిలో కలుస్తున్నది. త్రివేణీ సంగమమైన ప్రయాగలో స్నానం చేయడం శుభప్రదమని భక్తులు భావిస్తారు.

# కనువిప్పు

మార్తాండు డనే రాజు వద్ద, సుబుద్ధి అనే మంత్రి వుండేవాడు. రాజు కొలువులో చాలామంది బానిసలుండేవాళ్ళు. రాజు వాళ్ళచేత పశువుల్లాగా పని చేయించేవాడు.

ఒకనాడు సుబుద్ధి, రాజుకు, "మహారాజా! ఈ బానిసల్ని కూడా, మిగతా మనుషుల్లాగే బతకనివ్వండి," అని విన్నవించాడు.

దానికి రాజు, "రాజుల వారసులు రాజు లెలా అవుతారో, అదే విధంగా బానిసల వారసులు కూడా బానిసలే!" అన్నాడు.

కొద్ది రోజుల తరవాత సుబుద్ధి, రాజుతో, "ఈ రోజు మనం పూర్వీకులను గుర్తుపెట్టుకోవలసిన దినం. వారిని సంస్మరించి వద్దాం పదండి," అని ఆయనను వెంటబెట్టుకుని శ్మశానానికి వెళ్ళాడు.

అంతకు రెండు రోజుల ముందు కురిసిన భారీవర్షాల కారణంగా, శ్మశానంలో కాలిన శవాల ఎముకలన్నీ చిందరవందర అయిపోయి వున్నవి. మంత్రి కొన్ని ఎముకలను ఏరి, ఒక చోట కుప్పగా పోసి, రాజుతో, "మహారాజా! వీటిలో మీ పూర్వీకుల ఎముకలేవో, వారి బానిసల ఎముకలేవో నాకు తెలియడం లేదు. మీరు గుర్తుపడితే, తతిమ్మా కార్యక్రమం నేను చూసుకుంటాను," అన్నాడు.

ఈ మాటలతో రాజుకు కనువిప్పు అయింది. ఆయన, ఆ రోజే బానిసలందర్నీ విడుదల చేసి, వాళ్ళు కూడా మిగతా మనుషుల్లాగే స్వతంత్ర జీవనం గడుపుకునే ఏర్పాట్లు చేశాడు.

—సి. ఎస్. ఎ. షరీఫ్





# నాదేగడ్డం

అనగనగా ఒక ఊరిలో ఇద్దరు స్నేహితులు. వాళ్ళిద్దరూ బాగా వ్యాపారం చేసి, డబ్బు కూడబెట్టుతున్నవాళ్ళే. ఐతే— మొదటివాడు కొంచెం ఖర్చు మనిషి. రెండవవాడికి ఎంత వచ్చినా ఇంకా రావాలీ అనే కాంక్ష ఎక్కువ. మొదటివాడికి నున్నటి గుండు; రెండవవాడు ఏ కారణం వల్లనో గడ్డం పెంచాడు.

ఒక రోజున ఇద్దరూ సరదాగా మాట్లాడుకొంటూ వుండగా, మొదటివాడు, "నేస్తం! ఇన్నాళ్ళాయె, నీ ఎదట అనలేదు కాని, నీ గడ్డం చూస్తే ఎంతో ముచ్చటవేస్తూంది. ఇంతవరకూ నే నెన్నో గడ్డాలు చూసుకొంటూ వస్తున్నా, నీ గడ్డం లాంటి గడ్డం మట్టుకు మన దేశంలోనే లేదంటే నమ్ము." అన్నాడు.

ఇందుకు రెండవవాడు మురిసిపోతూ, "అవును మిత్రమా!— అందరూ అలాగే అంటున్నారు. అంతేకాదు. ఎంతోమంది నా గడ్డం మీద కన్ను వేశారు కూడాను. అవకాశం దొరికితే వాళ్ళు దాన్ని ఎంత ఖరీదయినా సరే కొని వేదామని కూడా వున్నారు," అని చెబుతూ, తన గడ్డంలోకి కుడిచేతి ఐదు వేళ్లూ పోనిచ్చి ఉత్సాహంతో నిమురజొచ్చాడు.

ఈ మాట వినగానే, మొదటివాడు ఆత్రంతో "ఎవడో ఎందుకు? నేనే కొంటా. ఎంతో చెప్పు!" అన్నాడు.

ధనాశ గల రెండవవాడికి మనస్సులో అనేకమైన వూహలు ఒక్కసారిగా పరుగులెత్తినై. అప్రయత్నంగా మాటవరసకు ఇలా అనేశాడు: "ఐతే ఒక వెయ్యి మొహిరీలు ఇయ్యి చూదాం."

"ఓ, దానికేం! తప్పకుండా తీసుకో. ఇంకా నువ్వెంత గొప్ప వెల కోరతావోననుకున్నాను నేను...." అంటూ వెంటనే

జేబులో నుంచి కొంత సొమ్ము తీసి బయానా ఇచ్చాడు మొదటివాడు.



ఇందుకు రెండవవాడు బిత్తర పోయాడు. మొదటివాడు ఒకే ఒక షరతు పెడుతూ, "సరేనేస్తం! ఇంతటి నుంచీ ఆ గడ్డం నాది. ఐతే, నీ సొమ్ము నీకు పూర్తిగా చెల్లించి నా గడ్డం నేను తీసేసు కునేవరకూ దాన్ని నీవు జాగర్తగా కాపాడ వలసి వుంటుంది. తెలిసిందా?—నా గడ్డానికి నా యిష్టప్రకారం తైలం రాయాలి. నేను చెప్పిన విధంగా దానిని కత్తిరిస్తూవుండాలి," అని హెచ్చరించాడు.

'ఓశ్, దీనికేముంది!' అని అను కొంటూ రెండవవాడు వెంటనే వాని షరతుకు అంగీకరించాడు. వ్రాతపూర్వ కంగా పత్రాలు రాసుకున్నారు. మొదటి వాడు మళ్ళీ ఇంకొకసారి హెచ్చరించాడు: "ఇంకొకమాట! ఇటుపైన ఎవరైనా ఆ గడ్డాన్ని చూసి, బాగా వున్నదీ అని మెచ్చు కున్నట్టయితే, వారితో నువ్వు, 'అయ్యా! ఈ గడ్డం నాది కాదండి. ఫలానావారిది. ఆయన దీనిని వెల యిచ్చి కొనేసుకు న్నాడు. ఆయనకోసమే నేను దీనిని పోషించుకు వస్తున్నాను' అని చెప్పాలి, తెలిసిందా?"

'సరే' నన్నాడు రెండవవాడు మరునాటి నుంచీ వేళా పాళా లేకుండా మొదటివాడు రెండవవాడి దగ్గరకు వస్తూండేవాడు. "ఏం నేస్తం ఇలా వచ్చావు?" అని పలకరిస్తే "మరేం లేదు మిత్రమా, నా గడ్డం ఎలా వుందో చూసుకుపోదామని వచ్చా," అనేవాడు.

ఒక్కొక్కనాడు ఉరుము లురుముతూ వచ్చి, "ఇదేమిటయ్యా, నా గడ్డమంతా నాశనం చేస్తున్నావే! నిగనిగలాడుతూ మెరిసిపోవలసిన నా గడ్డానికి చవుకబారు కొబ్బరినూనె పట్టిస్తే ఎలా అనుకొన్నావు? ఐనా, తీరూ తెన్నూ లేకుండా ఏమిటీ దువ్వకోవటం బొత్తిగా నాగరకత అనేది లేకుండా?" అంటూ కసిరి గట్టిగా కేకలు వేసేవాడు.

ఇలా అధికారం చెలాయించేసరికి, రెండవవాడి ప్రాణం విసిగిపోయింది. స్నేహితుని పోరు పడలేకపోయాడు. ఇద్దరికీ బెడిసింది. "బాబూ!—నీకు పుణ్యముంటుంది. ఏదో గడ్డి తిని ధనాశ చేత ముందువెనకలు యోచించకుండా వప్పుకున్నాను. నా గడ్డం మళ్ళీ నా కిచ్చెయ్యి. నీ డబ్బు నీవు తీసేసుకో" అని ప్రాధేయపడ్డాడు.

మొదటివాడు వప్పలేదు. రెండవవాడు, "పోనీ, నీ విచ్చిందానికి రెట్టింపు తీసుకో!" అన్నాడు. మొదటివాడు మాటాడలేదు. రెండవవాడు ఎలా ఐనా ఈ పీడ వదిలించుకుందామనుకొని, నాలుగు వేలిస్తానన్నాడు. ఇదెంతవరకూ పోతుందో చూదామని, మొదటివాడు వేడుక చూస్తూ బెట్టుగానే ఉంటూ వచ్చాడు.

రెండవవాడికి ఏమీ తోచిందికాదు, గట్టి చిక్కులో పడ్డాడు. ఇలా వుండగా—ఒకనాటి రాత్రి మొదటివాడు మామూలుగా వచ్చాడు. రెండవవాడు గాఢ నిద్రలో ఉన్నప్పటికీ సంశయించక మొండి చొరవతో గడ్డం పట్టుకు లాగాడు. ఆశ్చర్యం!—గడ్డం గడ్డం పళంగా వాని చేతిలోకి ఊడి వచ్చేసింది!

మొదటివాడు గభీమని లేచి, గోల చేసుకొంటూ న్యాయాధిపతి దగ్గరకు పోయి, మొర పెట్టుకొన్నాడు. తెలివి మంతుడైన అధికారి, ఇద్దరి ఉద్దేశాలనూ క్షణంలో గ్రహించి వేశాడు. విచారణ జరిపాడు.

'గడ్డం నేను కొన్నాను, హక్కు నాది' అనే ధీమాతో మొదటివాడు స్నేహితుణ్ణి హింసలు పెట్టడం, వాడు పెట్టే యాతనలు పడలేక—రెండవవాడు మాయగడ్డం అంటించుకోవడం వెల్లడయింది.

మొదటివాడు అర్ధరాత్రప్పుడు పని కట్టుకువెళ్ళి బలవంతాన లాక్కొన్న గడ్డం తనే పట్టుకుపోవలసిందనీ, రెండవవానికి అతను ఈయవలసిన బాకీ—గడ్డం ఖరీదు ఖర్చులలో సహా తక్షణమే చెల్లించవలసిందనీ అధికారి తీర్పు చెప్పాడు.





# కోపిష్టి భర్త

ఒకానొక గ్రామంలో బలభద్రుడనే రైతు వుండేవాడు. అతడు బాగా కష్టించి పని చేస్తాడు కాని, కోపం ఎక్కువ. కోపం వచ్చినప్పుడు అతడికి ఒళ్ళు తెలిసేది కాదు. అతడి భార్య శాంతకు ఓర్పు ఎక్కువ.

ఎటువంటి వాళ్ళ ఓర్పుకైనా ఒక హద్దంటూ వుంటుంది! ఒకనాడామె భర్త కోపాన్ని సహించలేక "ఎందుకు ఊరికే నన్నిలా సాధిస్తావు? నీకు ఏం లోటు చేస్తున్నాను? అంత ఇష్టం లేకపోతే, నన్ను ఇంట్లోంచి పొమ్మను. ఇక్కడ చేసే చాకిరీ ఎక్కడ చేసినా, నా బతుకు గడిచిపోతుంది," అన్నది.

భార్య మాటలకు బలభద్రుడి కోపం మరింతగా పెరిగిపోయి, "అయితే, తక్షణం ఇంట్లోంచి వెళ్ళిపో. హాయిగా బతుకు!" అన్నాడు.

శాంత కన్నీళ్ళు నింపుకుని, అప్పటికప్పుడే కట్టుబట్టలతో ఇల్లు వదిలి వెళ్ళిపోయింది.

ఆ రోజంతా బలభద్రుడు కోపంగానే వున్నాడు. మర్నాటికి అతడి కోపం కాస్త తగ్గింది. భార్య ఏ పొరుగింటికైనా వెళ్ళి తిరిగి వస్తుందని అనుకున్నాడు. కాని, అలా జరక్కపోయేసరికి అతడికి కంగారు పుట్టింది.

శాంతకు చిన్నతనంలోనే తల్లిదండ్రులు పోతే, మేనమామల ఇంట పెరిగింది. వాళ్ళామెను రాచిరంపాన పెట్టేవాళ్ళు. పెళ్ళి అయిన తరవాత వాళ్ళు శాంత ఇంటికి రావడం గానీ, శాంత వాళ్ళింటికి పోవడం గానీ జరగలేదు.

శాంత ఆ మర్నాడు కూడా తిరిగి రాకపోయేసరికి, బలభద్రుడు ఆమెను వెతకడం కోసం బయలుదేరాడు. ముందు

జొన్నలగడ్డ రామలక్ష్మి



ఊరంతా వెతికాడు. ఊళ్ళో ఎవరింట్లోనూ లేదనితెలిశాక, శాంతమేనమామల ఊరుకు వెళ్ళాడు. శాంత అక్కడాలేదు. ఆమె తమ ఇంటికి వస్తే తిప్పి పంపుతామని వాళ్ళు బలభద్రుడికి మాటయిచ్చారు.

బలభద్రుడికి కోపమైతే ఎక్కువే కాని, శాంత అంటే చాలా ఇష్టం. ఆమెను వెతికి పట్టుకోనిదే ఇంటికి వెళ్ళకూడదనుకున్నాడు. కాని, ఎక్కడ వెతకాలో అతడికి తెలియలేదు. తిరిగి ఇంటికి పోయి, ఊళ్ళో మరొకసారి అందర్నీ అడిగి చూడాలనుకున్నాడు.

అతడు ఊరు చేరగానే అప్పన్న అనేవాడు తన ఎద్దుబండిలో పోతూ బలభద్రుణ్ణి చూసి, "నీ భార్య, నా బండి ఎక్కింది. నేనావిణ్ణి రామాపురంలో దింపాను," అని చెప్పాడు.

రామాపురం అక్కడికి చాలా దూరం. బలభద్రుడు అప్పుడే బయలుదేరాడు. రామాపురం వెళ్ళడానికి చక్కని బాట వున్నది; అయితే అది చుట్టుదారి. దగ్గిర దారిన పోవాలంటే, కొంత దూరం అరణ్యమార్గాన నడవాలి. అందువల్ల, ఆ దారిన పోయేందుకు అందరూ భయపడతారు.

త్వరగా భార్యను చూడాలన్న ఆత్రుత కొద్దీ బలభద్రుడు, ఆ దగ్గిర దారినే పోవాలనుకున్నాడు. అతడు కొంత దూరం ప్రయాణం చేసి అరణ్యంలో ప్రవేశించాక, దారితప్పి ఒక కొండ ప్రాంతం చేరాడు. అక్కడ అలసట తీర్చుకునేందుకు ఒక గుహదగ్గిర కూర్చున్నాడు.

ఆ కొండగుహ కొందరు దొంగలకు స్థావరం. బలభద్రుడు కూర్చున్న కొంత సేపటికి, అక్కడికి అయిదుగురు దొంగలు వచ్చి, బలభద్రుణ్ణి, "నువ్విక్కడెందుకున్నావు?" అని అడిగాడు.

"రామాపురం వెళుతూ, అలసట తీర్చుకునేందుకు ఆగాను," అన్నాడు బలభద్రుడు.

దొంగలు అనుమానంగా, "రామాపురానికి దారి యిటుకాదే!" అన్నారు.

"అయితే సరైన దారి చెప్పండి, అటే వెళతాను," అన్నాడు బలభద్రుడు.

దొంగలకు బలభద్రుడి ధోరణి మరింత అనుమానం కలిగించింది. అతడు తమ ఆచూకీ తెలుసుకునేందుకు వచ్చిన, ఏ రాజభటుడో అయి వుంటాడనుకున్నారు.

వాళ్ళల్లో ఒకడు, బలభద్రుణ్ణి, "రామాపురంలో నీకేం పని?" అని అడిగాడు.

"అక్కడ నా భార్య వున్నది," అన్నాడు బలభద్రుడు.

"అలాగా! రామాపురం నాకు బాగా తెలుసు. మీ మామగారి పేరేమిటో చెప్పు?" అన్నాడు ఒక దొంగ.

"నాకు అత్తమామలు లేరు," అన్నాడు బలభద్రుడు.

"పోనీ, రామాపురంలో, నీ భార్య వుండే ఇల్లెక్కడ?" అని అడిగాడు ఇంకొక దొంగ.

"అది తెలుసుకునేందుకే, నేను రామాపురం వెళుతున్నాను. అసలు నా భార్య అక్కడ వున్నదో లేదో అన్న బెంగతో నేను చస్తుంటే, మధ్య మీ చచ్చు ప్రశ్నలేమిటి?" అన్నాడు బలభద్రుడు.

ఆ జవాబు విని దొంగలకు ఆశ్చర్యం కలిగింది. ఆ అరణ్యంలో తమను చూస్తే ఎవరైనా హడలిపోతారు. ఈ మనిషి యింత ధైర్యంగా వుండి, అంత కరుకుగా



మాట్లాడుతున్నాడంటే—దాపుల్లో ఎవరో యితడికి సాయపడేవాళ్ళుండాలి!

దొంగలకు యిలాంటి అనుమానం కలిగి, బలభద్రుణ్ణి మరి కొన్ని ప్రశ్నలడిగారు. అతడు వాటికి సరైన సమాధానాలివ్వకుండా కోపం తెచ్చుకుని, అక్కడి నుంచి లేచి బయలుదేరాడు.

దొంగల్లో ఒకడు మిగతా వాళ్ళతో, "వీడు చెప్పేవన్నీ అబద్ధాలు. ఆ మొండి ధైర్యం చూస్తూంటే, వీడు మారువేషంలో వున్న రాజభటుడై వుంటాడని, నా నమ్మకం. ఇలాంటి వాణ్ణి మంచి మాటలతో సంతృప్తిపరిచి పంపకపోతే, మనకు ప్రమాదం," అన్నాడు.



కూర్చున్నావు కనక, మా స్థావరం నీకు తెలిసిపోయింది. మేమిప్పుడు నిన్నేం చేసినా, దూరాన వున్న నీ అనుచరులు, తప్పకుండా నీకు సహాయపడేందుకు వస్తారు,'' అని దొంగలు గుహలోంచి ఒక చిన్న మూట తెచ్చి బలభద్రుడికి యిచ్చారు. ఆ మూటలో ధగధగ మెరిసే వజ్రాలున్నవి.

బలభద్రుడు మరేమీ మాట్లాడలేదు. దొంగలు అతడిని రామాపురం పొలిమేరల వరకూ తీసుకుపోయి, ''మమ్మల్ని చూశావన్న సంగతి మరిచిపో. మళ్ళీ డబ్బు కోసం, మా స్థావరానికి వస్తే, అక్కడ మేం కనబడం. స్థావరం వదిలి మరొక చోటుకు పోతున్నాం,'' అని తిరిగి అరణ్యంలోకి పోయారు.

తక్కిన దొంగలు యిందుకు ఒప్పుకున్నారు. వెంటనే అందరూ గబగబాపోయి, బలభద్రుణ్ణి కలుసుకుని, ''అయ్యా, మేమేదో పొట్టకూటికోసం దొంగతనాలు చేస్తూ బతుకుతున్నాం. నువ్వు, మా స్థావరం గురించి ఎవరికీ చెప్పవద్దు. బహుమతిగా నీకు ఏదైనా యిచ్చుకుంటాం,'' అన్నారు.

బలభద్రుడు ఆశ్చర్యపోతూ, "నేనెవరి ననుకుంటున్నారు ?'' అన్నాడు.

''ఇలాంటి ప్రమాదకరమైన చోటుకు వచ్చి కూడా, మా మీద కోపగించుకుంటున్నావంటే, నువ్వు తప్పక రాజభటుడివే అయుండాలి. నువ్వు, మా గుహ ముందు

బలభద్రుడు రామాపురం చేరి, అక్కడ విచారించగా, కొత్తగా ఆ గ్రామం వచ్చిన ఒకావిడ, గంగరాజు అనే అతని ఇంట పని చేస్తున్నట్టు తెలిసింది. అతను అక్కడికి పోయిన సమయంలో శాంత ఇల్లూడ్చుతున్నది. బలభద్రుణ్ణి చూసి ఆమె, ఇంటి లోపలి గదుల్లోకి వెళ్ళిపోయింది.

ఆ సమయంలో పొలం నుంచి తిరిగి వచ్చిన గంగరాజు, బలభద్రుణ్ణి చూసి, ''ఎవరు నువ్వు ?'' అని అడిగాడు.

బలభద్రుడు తన పేరు చెప్పుకుని, శాంత గురించి అడిగాడు.

''ఆహాఁ, ఆ అమ్మాయి చాలా మంచిది. పొద్దున లేచింది మొదలు, రాత్రి పడుకో బోయేవరకూ, వంచిన నడుం ఎత్తకుండా పని చేస్తుంది. ఆమె దొరకడం, మా అదృష్టం,'' అన్నాడు గంగరాజు.

''నేనామెతో ఒకసారి మాట్లాడాలి,'' అన్నాడు బలభద్రుడు.

గంగరాజు శాంతను పిలిచాడు. బలభద్రుడామెను పక్కకు తీసుకు వెళ్ళి, ''నా ఇంట్లో యింత పని వున్నదా? హాయిగా అక్కడ వుండక, పనిమనిషిలా యిక్కడ ఎందుకు బతుకుతున్నావు?'' అని అడిగాడు.

''ఇక్కడ యింత పని చేస్తున్నా, నాకు శ్రమ అనిపించడం లేదు. ఎంత పని చేసినా, ఒక మంచి మాట అని మెచ్చు కునేవాళ్ళుంటే—శ్రమ అనిపించదు,'' అన్నది శాంత.

''నేను, నిన్నెప్పుడూ మెచ్చుకోలేదనే గదా యిలా అంటున్నావు? నాకు నీ మీద ఎంత ప్రేమ వున్నదో, నీకేం తెలుసు!'' అని బలభద్రుడు, ఆమె కోసం ఎన్ని చోట్ల గాలించిందీ చెప్పి, ''ఈ గ్రామానికి దగ్గిర దారి అని, ప్రమాదకరమైన అరణ్యందాటి వచ్చాను,'' అన్నాడు.



భర్త ముఖం చూడగానే అతడు నిజమే చెబుతున్నాడని, శాంతకు అర్థమైంది. దానితో ఆమె కాస్త మెత్తబడి, ''అయితే, నువ్వూ యిక్కడికే వచ్చి వుండు. అక్కడి పొలం అమ్మి, ఇక్కడ పొలం కొనుక్కుందాం. నువ్వు పొలం పనిచేస్తే, నేనీ ఇంట్లో పని చేస్తాను. ఈ ఇంటివాళ్ళు చాలా మంచివాళ్ళు. ఇద్దరం సంపాయిస్తుంటే వేణ్ణీళ్ళకు, చన్నీళ్ళు తోడుగా వుంటుంది గదా!'' అన్నది.

''నువ్విప్పుడొకరి ఇంట్లో పని చేయనవసరం లేదు. అనుకోకుండా మనకు బోలెడు డబ్బు వచ్చి చేరింది. పట్నం వెళ్ళి ఇల్లు కొనుక్కుని, మనమే పని

వాళ్ళను పెట్టుకుని హాయిగా బతక వచ్చు," అన్నాడు బలభద్రుడు.

శాంత ఆశ్చర్యపోయి, "అన్నీ అబద్ధాలు! నన్ను ఇక్కడినుంచి తీసుకు పోవడానికి మాయమాటలు చెబుతున్నావు," అన్నది.

"అయితే చూడు!" అంటూ బలభద్రుడు తనవద్ద వున్న మూటలోని వజ్రాలు శాంతకు చూపించాడు.

శాంత తెల్లబోయి, "ఈ వజ్రాలెక్కడివి? ఉన్నపళంగా నీకివి ఎలా దొరికాయి?" అని ప్రశ్నించింది.

"నా కోపదారితనాన్ని నువ్వు తిడతావు గాని, అదే మనకింత అదృష్టాన్ని తెచ్చి పెట్టింది. నా కోపానికి అదిరిపోయి దొంగలీ వజ్రాలు యిచ్చారు," అని బలభద్రుడు జరిగినదంతా భార్యకు చెప్పాడు.

భర్త చెప్పింది వింటూనే శాంత కంగారుగా, "నువ్వు యింకేమీ నాకు చెప్పకు. నేను నీ కోపాన్ని భరించలేక ఇల్లువదిలి వచ్చాను. తర్వాతనైనా బుద్ధి వచ్చి కోపం తగ్గించుకుంటావేమో అని ఆశపడ్డాను. నీ కోపమే, నీ అదృష్టం అని నమ్మే నువ్వు, ఇక దాన్ని వదులుకోలేవు. నేను నీతో ఇంటికి రాను," అన్నది.

బలభద్రుడు విచారంగా, "శాంతా, అంత తొందరపడకు. నాలో వున్న విపరీతమైన కోపం అదృష్టానికే కాదు, దురదృష్టానికూ్కడా కారణం అవుతుందని తెలిపోయింది కదా! నువ్వు అనుకుంటున్నట్టు, నా కోపమే, నా అదృష్టం అని నమ్మడం లేదు. ఇక, ఇంటికి వెళదాంపద," అన్నాడు.

తాను ఇల్లు వదిలాక, భర్తకు కలిగిన అనుభవాల ద్వారా, అతడు కోపాన్ని అదుపులో పెట్టుకోగలుగుతున్నాడని, శాంత గ్రహించింది. అలా కాకపోతే, ఇంటికి రానన్నందుకు అతడు, తన మీద ఎక్కడలేని కోపం తెచ్చుకునేవాడు!

ఇలా ఆలోచించిన శాంత, బలభద్రుడితోపాటు అప్పటికప్పుడే సొంత గ్రామానికి బయలుదేరింది.





# నౌకరు తెలివి

ధర్మవరం జమీందారు సోమేశ్వరుడికి విపరీతమైన నిద్ర వుండేది. ఆయన రాత్రి పడుకుంటే అనుకున్న సమయానికి లేవలేక పోయే వాడు. అందువల్ల ఎన్నో అత్యవసరమైన పనులు సకాలంలో కాక యిబ్బందులకు గురవుతూండేవాడు.

ఆయన బాగా ఆలోచించి, తనను కావాలన్నప్పుడు నిద్ర లేపేందుకు ఒక పనివాణ్ణి పెట్టుకోవడం బావుంటుందనుకున్నాడు. ఈ సంగతి దివానుకు చెప్పాడు. అనంతుడనే యువకు డొకడు దివాను, ద్వారా విషయం తెలుసుకుని, యీ పని తనకు యిప్పించవలసిందిగా కోరాడు. దివాను వాణ్ణి, జమీందారు దగ్గిరకు తీసుకు పోయాడు.

జమీందారు, అనంతుడితో, "నేను రేపు తెల్లవారుజామున నాలుగు గంటలకు నరసింహపురం వెళ్ళాలి," అన్నాడు.

ఆ రాత్రి సరిగ్గా నాలుగ్గంటల సమయాన అనంతుడు, జమీందారును నిద్ర లేపాడు.

ఆయన సాయంకాలం నరసింహపురం నుంచి తిరిగి వచ్చి, అనంతుణ్ణి పిలిచి, "పెందరాళే లేచి వెళ్ళడం వల్ల, అనుకున్న పనులన్నీ పూర్తయాయి," అంటూ మెచ్చుకుని, "రేపు తెల్లవారుజామున జగన్నాథపురం వెళ్ళాలి. ఐదుగంటలకు నిద్ర లేపు," అని చెప్పాడు.

ఆ విధంగానే ఐదు గంటలవేళ అనంతుడు, జమీందారును నిద్ర లేపాడు.

ఆ రోజు చీకటి పడుతూండగా జమీందారు జగన్నాథపురం నుంచి తిరిగి వచ్చి, అనంతుడితో, "ఈ రోజుతో నువ్వు పనిలో చేరి రెండు రోజులైంది. నెల కూడా యీ రోజుతో ముగుస్తున్నది. రేపటి నుంచి కొత్త నెల ప్రారంభమవుతుంది. అందువల్ల,

రాంబాబు

యీ రెండు రోజులకూ జీతంగా నాలుగు వరహాలిస్తున్నాను. వచ్చే నెల నుంచి, నెలాఖర్న అరవైవరహాలు జీతంగా యిస్తాను,'' అని వాడి చేతిలో నాలుగు వరహాలు పెట్టాడు.

ఆ తరవాత జమీందారు లోపలికి వెళ్ళి బట్టలు మార్చుకుని, వీధి అరుగు దగ్గిరకు వచ్చేసరికి, అనంతుడు మరొక యువకుడి చేతిలో రెండు వరహాలు పెట్టడం అయన కంటబడింది. జమీందారు ఆశ్చర్యపోయి, ''అతనెవరు ? ఎందుకు రెండు వరహాలిస్తున్నావు ?'' అని అడిగాడు.

అనంతుడు భయపడుతూ, ''అయ్యా, మరేం లేదు. ఇతను....'' అంటూ మాట పెగలక తడబడసాగాడు.

జమీందారు కోపం తెచ్చుకుని, ''అసలు విషయం చెప్పడానికి ఎందుకు జంకుతున్నావు ?'' అని గద్దించాడు.

అనంతుడు వణికిపోతూ, ''ఈ రెండు రోజులూ మీరు చెప్పిన సమయానికి కొంచెం ముందుగా నన్ను నిద్రలేపినందుకు, యితడికి రెండు వరహాలు యిస్తున్నాను,'' అన్నాడు.

ఈ జవాబుతో జమీందారుకు, అనంతుడు కూడా నిద్ర విషయంలో తన లాంటి వాడేనని తెలిసిపోయింది. ఆయన వాడి తెలివితేటలకు చిన్నగా నవ్వుకుని, ''ఒరే, అనంతా, రేపటి నుంచి నీకు తోటలో చెట్లకు నీళ్ళు పోసే పని యిస్తున్నాను, జీతం యిదే !'' అని కొత్త యువకుడితో, ''ఈ రెండు రోజులుగా అనంతుడు చేస్తున్న పని చేయడం, నీకు యిష్టమేనా ?'' అని అడిగాడు.

వాడు యిష్టమే అన్నట్టుగా తలాడించాడు. జమీందారు వాడి ముఖంలోకి పరీక్షగా చూస్తూ, ''ఇప్పుడు నువ్వు, అనంతుడి దగ్గిర తీసుకున్న రెండు వరహాలలో మరొకడికి వాటా లేదు గదా ?'' అని ప్రశ్నించాడు.

యువకుడు, జమీందారు ఛలోక్తిని అర్థం చేసుకుని నవ్వుతూ, ''అయ్యా, ఇవి పూర్తిగా నా సొంతం,'' అన్నాడు.






సతీదేవి నందీశ్వరుణ్ణి కూడా వెంటబెట్టుకుని యజ్ఞశాల వద్దకు చేరేసరికి, ఆమె తల్లి ప్రసూతీ, సహోదరులూ ఎదురు వచ్చి కుశల ప్రశ్నలు వేశారు. సతీదేవితో ఆమె తల్లి రహస్యంగా, ''మీ నాన్నకు ముసలితనం వచ్చేసింది. ఆయన నీ భర్తను తిడుతున్నాడు. నువ్వేమీ పట్టించుకోకు,'' అని చెప్పి, ఆమెను యజ్ఞశాలలోకి తీసుకుపోయింది.

దక్షుడికి తన కుమార్తెను చూడగానే శివుడి మీద ఆగ్రహం పెరిగింది. ఆయన సతితో, ''నీ మొగుడు శ్మశానవాసి, పిశాచాలను ఏలుతాడు, కపాలాలు ధరిస్తాడు, అపవిత్రుడు, యజ్ఞయాగాదులకు పిలవరానివాడు. అతని భార్యవై నువూ అపవిత్రురాలవయావు నీ మొగుణ్ణి నేను పిలవలేదు, అతనికి యాగభాగం ఇవ్వటం లేదు. నువు ఈ యజ్ఞాన్ని అపవిత్రం చెయ్యటానికి వచ్చావా?'' అన్నాడు.

సతీదేవి ఈ మాటలు విని తండ్రితో, ''యజ్ఞకర్త అయిన శివుడికి హవిర్భాగం లేకుండా యజ్ఞం చేస్తున్నావు; పైగా ఆయనను దూషిస్తున్నావు. ఇప్పటికైనా ఆయనను పిలిపించి, యజ్ఞభాగం ఇచ్చి గౌరవించు! లేకపోతే నీ యజ్ఞం పూర్తి కాదు; నువు నశిస్తావు!'' అన్నది.

సభలో ఉన్న భృగువు మొదలైనవారు, ఆమె చెప్పినట్టు చేయమనీ, ఆమె అన్నది నిజమనీ దక్షుడికి హితం చెప్పారు.

2. వీరభద్ర విజయం



దక్షుడు మరింత మండిపడి, "సతీ, నీ మొహం చూస్తే పాపం! నువు యజ్ఞశాలనుంచి తక్షణం వెళ్ళిపో. పోకపోతే నిన్ను బలవంతాన గెంటిస్తాను," అని అరిచాడు.

సతీదేవికి హృదయం మండిపోయింది. భర్త మాట వినకుండా రావటం పెద్ద పొరపాటయిందని అప్పుడు ఆమె గ్రహించింది. ఈ అవమానం పొంది భర్త దగ్గిరికి తిరిగి పోవటం ఇష్టం లేక, వచ్చే జన్మలో శివుడే తన భర్త కావాలని మనసార కోరుకుంటూ, యోగ శక్తితో అగ్నిపుట్టించుకుని అందులో ప్రాణాలు వదిలింది.

ఇది చూసి నందీశ్వరుడు మొదలైన వాళ్ళు హాహాకారాలు చేస్తూ యజ్ఞశాల ప్రవేశించబోతే, భృగుమహర్షి అభిచార హోమం చేసి వారిని అక్కడి నుంచి తరమగొట్టాడు.

నారదుడు మొదలైనవారు కొందరు కైలాసానికి వెళ్ళి శివుడితో జరిగిన సంగతి చెప్పారు. శివుడు క్రోధాగ్రహావేశుడై హుంకరిస్తూ తన జటను ఒకదాన్ని పెరికి పర్వతం మీద కొట్టాడు. అప్పుడా జట నుండి భద్రకాళీ, వీరభద్రుడూ పుట్టారు. వీరభద్రుడు వెయ్యి చేతులతో, నిడుపాటి కోరలతో, కోటి సూర్యుల కాంతితో మహా రౌద్రాకారుడై ఉన్నాడు. అతను శివుడికి నమస్కరించి, "తండ్రీ! ఏమిటి నీ అజ్ఞ?" అన్నాడు.

"నాయనా, వీరభద్రా! నువూ, భద్రకాళీ మీ గణాలతో సహా వెళ్ళి, దక్షయజ్ఞం ధ్వంసం చేసి, అందులో పాల్గొన్నవాళ్ళను దండించండి," అన్నాడు శివుడు.

వీరభద్రుడు సింహాలను పూన్చిన రథం ఎక్కి, నందీశ్వర, చండీశ్వర, భైరవాది గణాలను వెంటబెట్టుకుని బయలుదేరాడు. భద్రకాళి సింహాన్ని ఎక్కి, మహాకాళీ, గౌరీ, కాత్యాయనీ, చాముండా మొదలైన మహాశక్తి గణాలను వెంటబెట్టుకుని బయలుదేరింది.

అక్కడ దక్షుడు యాగం చేసే చోట ఉత్పాతాలు కలిగాయి. ఉల్కలు రాలాయి. రక్త వర్షం కురిసింది. ఆకాశం నుంచి పాములూ, తేళ్ళూ, క్రిమికీటకాలూ పడ్డాయి. యాగశాలలో ఉన్నవాళ్ళు కొందరు దక్షుణ్ణి తిట్టారు. మరి కొందరు ప్రాణాలకు వెరిచి పారిపోయారు.



ఈ లోపల వీరభద్ర గణాలవాళ్ళు యాగశాలను చుట్టుముట్టి, బయటికి వచ్చేవారిని బాధించసాగారు. వీరభద్రుడు తన ప్రముఖ అనుచరులతో యాగశాల ప్రవేశించాడు. వాళ్ళందరూ లోపల ఉన్న దేవతలనూ, ఋషులనూ చావబాద సాగారు. దక్షుణ్ణి చూడగానే వీరభద్రుడికి తన తండ్రి అయిన శివుడి దుఃఖం జ్ఞాపకం వచ్చి ఎక్కడలేని రౌద్రమూ వచ్చింది. అతను దక్షుడి తలను నరికి హోమగుండంలో హోమం చేశాడు.

తరవాత వీరభద్రుడు ఋత్విక్కులనూ, దేవతలనూ, యాగశాలలో ఉన్న మిగిలినవాళ్ళనూ చూసి. "ఈశ్వర ద్రోహి అయిన దక్షుడు చేసే యాగానికి వచ్చినందుకు ఫలం అనుభవించండి," అని వారిని నానా హింసలూ పెట్టాడు.

దక్షుడి భార్య అయిన ప్రసూతీ, ఇతరులూ వచ్చి వారిని ప్రార్థించి శాంత పరిచారు. అప్పుడు భద్రకాళీ వీరభద్రులు తమ తమ సేనలతో కైలాసపర్వతానికి వెళ్ళి, శివుడికి భక్తితో నమస్కరించి నిలబడ్డారు.

ఈ లోపుగా, వీరభద్రుడు మొదలైన వాళ్ళ చేత చావుదెబ్బలు తిన్న దేవతలూ, ఋషులూ బ్రహ్మ వద్దకు వెళ్ళి జరిగినది చెప్పారు. బ్రహ్మ వారందరినీ వెంట బెట్టుకుని వైకుంఠానికి వెళ్ళి విష్ణువుతో, వీరభద్రుడు దక్షుడి తల నరికి హోమగుండంలో వెయ్యటమూ, దక్షయాగం విధ్వంసం కావటమూ మొదలైన వివరాలన్నీ చెప్పాడు. అందరూ కలిసి కైలాస పర్వతానికి వచ్చారు. వారు వచ్చేసరికి శివుడు ధ్యాన సమాధిలో ఉన్నాడు.



అయన చుట్టూ వీరభద్రుడు మొదలైన వాళ్ళూ, గణాలవాళ్ళూ ఉన్నారు.

శివుడు సమాధి చాలించి బ్రహ్మ విష్ణులనూ, దేవతలనూ, ఋషులనూ చూసి, అందరినీ కూర్చోమని చెప్పాడు.

విష్ణువు శివుడితో, "సదాశివా, కోపాన్నీ, విచారాన్నీ వదిలిపెట్టు. ప్రకృతి మాయలో పడకు. నిన్ను ద్వేషించినందుకు దక్షుడు ఫలితం అనుభవించాడు. కాని దక్షుడు ప్రారంభించిన యాగం పూర్తి కాకపోతే ప్రపంచానికి అనావృష్టి కలిగి, చాలా నాశనం జరుగుతుంది. అందుచేత నువు దక్షుణ్ణి బతికించి, అతని యాగాన్ని పూర్తి చేయించు," అన్నాడు.

శివుడు అందుకు సమ్మతించి, "మనమందరమూ వెళ్ళి దక్షుడి యాగం పూర్తి అయేటట్టు చేసి, లోకాలను కాపాడదాం," అన్నాడు. వాళ్ళు యాగశాలకు వెళ్ళేసరికి, యాగశాల బీభత్సంగా ఉన్నది. అగ్నిగుండంలో దక్షుడి తల రూపు లేకుండా పోయింది.

శివుడు వీరభద్రుడితో, "నువు ఉత్తర దిక్కుగా వెళ్ళి, ఉత్తరంగా తల పెట్టుకుని పడుకుని ఉన్న వాళ్ళ శిరస్సు నరికి తీసుకురా!" అని పంపాడు.

వీరభద్రుడు ఒక గొర్రె తలను నరికి తెచ్చాడు. దక్షుని మొండానికి ఆ గొర్రె తలను తగిలించి, దక్షుణ్ణి బతికించి, ఆయన చేత వేదోక్తంగా యాగం పూర్తి చేయించారు. ఈ సారి దక్షుడు శివుడికి కూడా భాగం ఉండేలాగు యాగం చేశాడు. తరవాత ఆయన శివుణ్ణి క్షమాపణ వేడుతూ, "నేను నీ గొప్పతనం తెలుసుకోలేక నిన్ను దూషించాను. నిన్ను దూషించిన ఆ తల పోయింది. నీ దయవల్ల, నాకు బుద్ధితో కూడిన తల ఏర్పడింది. నా తప్పులు మన్నించి, నన్ను కాపాడు," అన్నాడు.

శివుడు దక్షుడి క్షమాపణను ఆమోదించి, "దక్షా, కారణం లేక కార్యం పుట్టదు. నీ తప్పులను నేను క్షమించాను,"

అని, దక్షుణ్ణి ఏదైనా వరం కోరుకో మన్నాడు.

అప్పుడు దక్షుడూ, ఆయన భార్యా మొదలైనవారు, దక్షయాగం జరిగిన చోటు దక్షవాటిక అనే పేరుతో ప్రసిద్ధం కావాలనీ, అది శివుడి నిలయంగా వుండాలనీ కోరారు. శివుడు అందుకు సమ్మతించి భద్రకాళీ, వీరభద్రులతో, ''ఈ ప్రదేశానికి ఆగ్నేయంగా ఉండే గౌతమీతీరాన మీరు మీ గణాలతో నివసించండి,'' అన్నాడు.



ఆయన భద్రకాళీ సహితంగా వీర భద్రుణ్ణి గణాధిపతిగా చేసి, సతీదేవి శరీరాన్ని తీసుకుని, బ్రహ్మ విష్ణులతో సహా కైలాసానికి తిరిగి వచ్చి, బ్రహ్మ విష్ణులనూ, ఋషులనూ పంపివేసి, సతీ దేవి శరీరాన్ని పక్కన ఉంచుకుని, తపస్సులో మునిగిపోయాడు.

దక్షుడి కుమార్తెలలో స్వధ అనే ఆమె పితృదేవతలకు భార్య అయి, మేనకా, ధన్యా, కళావతీ అనే ముగ్గురు కుమార్తె లను కన్నది. వాళ్ళు చాలా అందగత్తెలు; అందరి కోరికలూ తీర్చుతూ, లోకాలన్నీ తిరుగుతూ ఉండేవారు.

ఒకసారి వారు ముగ్గురూ మహాలక్ష్మి విష్ణువులను చూడబోయి, వారిని తమ నృత్యగానాలతో ఆనందపరిచి, కూర్చుని కబుర్లు చెబుతూండగా అక్కడికి బ్రహ్మ మానసపుత్రులైన సనకసనందనాదులు వచ్చారు. వారిని చూసి విష్ణువుతో సహా అందరూ ఎదురువెళ్ళి, నమస్కారాలు చేసి గౌరవించారు. కాని మేనకా, ధన్యా, కళావతులు మాత్రం ఆసనాల నుంచి లేవలేదు.

అది చూసి సనత్కుమారుడు కోపించి, ''మీకు గర్వం బాగా ఎక్కిపోయింది. మీరు ఇకపై స్వర్గంలో ఉండ తగరు. భూలోకంలో వారిని పెళ్ళాడి, అక్కడే ఉండిపొండి,'' అని ఆ ముగ్గురినీ శపించాడు.

అప్పుడు వాళ్ళు పశ్చాత్తాప పడి, ''మునీ శ్వరులారా, అజ్ఞానంచేత చేసిన మా తప్పు



ఈ సంగతి తెలుసుకుని ఆ ముగ్గురు కన్యలూ తృప్తిపడి, విష్ణువు వద్ద సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయారు.

హిమాలయానికి రాజైన హిమవంతుడు చాలా అందమైనవాడు. అతను తన కొండ పైన గల ఆశ్రమాలన్నీ తిరుగుతూ, అక్కడ తపస్సు చేసుకునే దేవతల యోగక్షేమాలూ, మహాఋషుల యోగక్షేమాలూ శ్రద్ధగా విచారిస్తూ ఉండేవాడు. అందుచేత వాళ్ళు అతనికి మేనక నిచ్చి వివాహం చేయించారు.

ఒకనాడు హిమవంతుడి వద్దకు బ్రహ్మ, విష్ణువూ, దేవేంద్రుడూ, ఇతర దేవతలూ వచ్చారు. హిమవంతుడు వారికి భక్తితో షోడశోపచారాలూ చేసి, వచ్చిన పని అడిగాడు.

"మహాశక్తి దక్షుడికి సతి అనే కుమార్తెగా పుట్టి, శివుణ్ణి పెళ్ళాడి, శరీరం త్యజించింది. శివుడు సతి పోయాక విరక్తితో తపస్సు చేసుకుంటున్నాడు. ఇప్పుడు తారకాసురు డనేవాడు రాక్షసులకు రాజై లోకాలను క్షోభపెడుతున్నాడు. మహాశక్తి తిరిగి జన్మించి, శివుణ్ణి పెళ్లాడి, ఒక కొడుకును కనేదాకా తారకుడు ఇలా లోకపీడ చేస్తూనే ఉంటాడు. అందుచేత నువూ, మేనకా ఆ మహాశక్తిని గురించి తపస్సు చేసి, ఆమె మీకు కుమార్తెగా

క్షమించి, మాకు శాప విమోచనం అనుగ్రహించండి!" అని వేడుకున్నారు.

దానికి సనకసనందనాదులు, "గర్వానికి ప్రాయశ్చిత్తం గర్వం పోవటమే. ఇక శాపం మాట అంటారా? ఈ శాపం లోకాలకు మేలు కలిగించేదే," అన్నారు. (ఇది ఎలా నిజమయిందంటే, ఈ ముగ్గురికీ పుట్టిన కుమార్తెలు మూడు యుగాలలో అవతార పురుషులను పెళ్ళాడారు. మేనకకు పుట్టిన పార్వతి శివుణ్ణి పెళ్ళాడింది. జనక మహారాజుకూ, ధన్యకూ కుమార్తె అయిన సీత రాముణ్ణి పెళ్ళాడింది, వృషభుడికీ, కళావతికీ పుట్టిన రాధ కృష్ణుణ్ణి పెళ్ళాడింది.)

పుట్టేలాగు వరం పొందండి,'' అని దేవతలు హిమవంతుణ్ణి హెచ్చరించారు.

తరవాత బ్రహ్మ విష్ణు మహేంద్రాదులు వింధ్యపర్వతానికి వెళ్ళి, అక్కడ తపస్సు చేస్తున్న మహాదేవిని భక్తితో స్తోత్రం చేశారు.

కాంతులు అన్ని దిశలా విరజిమ్మే కిరీటం ధరించి, వెయ్యి చేతులతో త్రిశూలం మొదలైన ఆయుధాలు ధరించి పరదేవత వారి ముందు ప్రత్యక్షమయింది. అప్పుడు బ్రహ్మాదులు ఆమెతో, ''తల్లీ, నువు దక్షుడి కుమార్తెగా జన్మించి, సతీ అనే పేరుతో శివుణ్ణి వివాహమాడి, దక్షుడి మీది కోపంతో సతీ దేహాన్ని విడిచేశావు. సతీ వియోగంతో విరక్తుడై శివుడు తపస్సులో మునిగిపోయాడు. అందుచేత తారకాసురుడు మొదలైన వాళ్ళు యధేచ్ఛగా లోకాలను పీడిస్తున్నారు. కనుక, ఇప్పుడు నువు మేనకా హిమవంతుల కడుపున పార్వతిగా పుట్టి, శివుణ్ణి పెళ్లాడి, లోకాలను కాపాడాలి,'' అన్నారు.

మహాదేవి బ్రహ్మ విష్ణు మహేంద్రుల కోరిక తీర్చుతానని మాట ఇచ్చి అంతర్హితురాలయింది.

ఈ లోపల మేనకా హిమవంతులు బ్రహ్మ మొదలైన వారి హితాన్ని అనుసరించి, వారు సూచించిన విధంగా తపోనియమం దాల్చి, చైత్రశుద్ధ పాడ్యమినాడు వ్రతం ప్రారంభించి ఇరవైఏడు వారాల పాటు అమిత భక్తితో పరదేవతను పూజించారు. పరదేవత సంతోషించి, వారి ఎదట ప్రత్యక్షమై ఏం వరం కావాలో కోరమన్నది.

అప్పుడు మేనకా హిమవంతులు, ''తల్లీ, నీ మూలంగా మేము తరించాం. మాకు బల శౌర్యగుణాఢ్యులైన నూరుమంది కొడుకులను ప్రసాదించి, మా గర్భవాసాన కుమార్తెగా పుట్టి, లోకరక్షణార్థం శివుణ్ణి పెళ్ళాడి, మాకు శాశ్వతమైన కీర్తిని కలిగించు!'' అని కోరారు.

పరదేవత వారి కోరికలు తీరుస్తానని వరమిచ్చి అంతర్ధానమయింది.





# కముజుపిట్ట సాక్ష్యం

బొగ్దాదు నగరానికి సమీపానగల కొండల్లో, ఒక దొంగ వుండేవాడు. వాడు యువకుడు, మంచి బలశాలి. వాడు వాయు వేగంతో పరిగెత్తగలడు. కత్తిని మెరుపులా ఝుళిపించి ప్రాణాలు తీయగలడు.

వాడు వుంటున్న కొండదారి వెంట ఎవరైనా ప్రయాణీకులు కనబడితే, హఠాత్తుగా వచ్చి వాళ్ళ మీద పడి, తలలు నరికి, వాళ్ళ దగ్గిర వున్నదంతా దోచుకుని, తిరిగి కొండల్లోకి పారిపోయేవాడు. వాణ్ణి పట్టేందుకు సుల్తాను భటులు ఎన్నో ప్రయత్నాలు చేసి విఫలులయ్యారు.

ఒకనాటి సాయంకాలం, ఒక ముసలి ప్రయాణీకుడు, వాడున్న కొండదారి వెంట వస్తున్నాడు. అతడు మరొక ప్రాంతంవాడు.

దొంగ కొండరాళ్ళ చాటు నుంచి హఠాత్తుగా వచ్చి ముసలివాణ్ణి అటకాయించి, "ఒరే, ముసలివాడా, నీకు చావు తప్పదు!" అంటూ కత్తి ఎత్తాడు.

భయకంపితుడైపోయిన ముసలి ప్రయాణీకుడు దీనంగా, "కుర్రవాడా, యీ సంచీలో వున్న డబ్బు, నేనింతకాలం కష్టించి సంపాయించినది. నా భార్య చనిపోయింది. ఒక్కగానొక్క కూతురు నగరానికి దాపులనున్న గ్రామంలో నివసిస్తున్నది. నేను ముసలివాణ్ణయాను. ఇంకా మిగిలివున్న కొద్ది కాలాన్ని, నా కూతురు ఇంట గడపదలిచాను. ఈ డబ్బులో సగం తీసుకుని, మిగిలిన సగం నాకు వదులు," అన్నాడు.

దానికి దొంగ వికటంగా నవ్వి, "అది, నా పద్ధతే కాదు. ఉన్నదంతా దోచుకోవడమే నా పని," అన్నాడు.

ముసలివాడు ఒకసారి బాధగా మూలిగి, "సరే, నేను నిస్సహాయుణ్ణి.

అరేబియా కథ



అలాగే డబ్బంతా తీసుకో. నా దారిన నేను పోతాను,'' అన్నాడు.

దొంగ డబ్బు సంచీ తీసుకుని, మరొక సారి వికటంగా నవ్వి, ''నీదారిన నిన్ను పోనివ్వడమా? అదేం సాగదు నిన్ను ఈ రోజు ప్రాణాలతో వదలను,'' అన్నాడు.

''అదేమిటి? నా దగ్గిరున్న డబ్బంతా యిచ్చాను గదా. ఇంకా నన్ను చంపడం ఎందుకు?'' అని అడిగాడు ముసలివాడు ఆశ్చర్యపోతూ.

''దోచుకున్న తరవాత, వాళ్ళను చంపడం నా అలవాటు,'' అంటూ దొంగ కత్తి పైకెత్తాడు.

ముసలివాడు గడగడ వణికిపోతూ చుట్టూ కలయచూశాడు. ఎక్కడా మనిషన్నవాడు లేడు.

తరవాత అతడు మోకాళ్ళ మీద వంగి దైవప్రార్థన చేస్తూ తల పైకెత్తాడు. ఆకాశంలో అతడికి ఒకే ఒక కముజుపిట్ట ఎగురుతూ కనిపించింది.

ముసలివాడు పెద్దగా గొంతెత్తి, ''కముజుపిట్టా, యీ జరుగుతున్న ఘోరానికి నువ్వే సాక్షివి! ఈ దొంగ నన్ను అన్యాయంగా చంపుతున్నాడు. ఏమాత్రం ఎదురు తిరక్కుండా, నా దగ్గిర వున్న డబ్బంతా యిచ్చాను. అయినా నన్ను కరుణించి వదలక చంపబోతున్నాడు,'' అన్నాడు.

ముసలివాడు మాట పూర్తి చేస్తూండగానే, దొంగ అతడి తల నరికాడు.

కొంతకాలం గడిచింది. క్రమంగా దోచిన ధనంతో దొంగ బాగా ధనవంతుడయ్యాడు. వాడికిప్పుడు పేరు ప్రతిష్ఠలు సంపాయించాలన్న బుద్ధి పుట్టింది. వాడు కొండలను వదిలి ఒక పట్టణంలో స్థిరపడ్డాడు. వాడు చదరంగంలో మంచి ఆటగాడు. ఆ పట్టణ సుల్తానుకు చదరంగంపట్ల చాలా ఆసక్తి. ఆ కారణంగా దొంగ సుల్తానుకు పరిచితుడయ్యాడు.

ఈ పరిచయం కొన్నాళ్ళకు వారిద్దరి మధ్యా స్నేహంగా మారింది. సుల్తానూ, దొంగా కలిసి విందు భోజనం చేస్తూ మద్యం తాగుతూండేవాళ్ళు. అలాంటి సమయాల్లో దొంగ సుల్తానుకు గతంలో తాను చేసిన దారిదోపిడీలను గురించి చెబుతూండేవాడు.

వాడిప్పుడు మర్యాదస్థుడుగా జీవిస్తున్నాడు గనక, సుల్తాను వాడు చెప్పేది విని వూరుకునేవాడు.

ఒక రాత్రి యిద్దరూ భోజనాలు చేస్తున్నారు. దొంగ అతిగా ద్రాక్షసారాయం తాగాడు. ఆ సమయంలో సుల్తాను నౌకరొకడు వాళ్ళ ముందు పెద్ద పళ్ళెంలో బాగా వేయించిన కముజును పెట్టాడు. దాన్ని చూస్తూనే దొంగ పగలబడి నవ్వాడు.

సుల్తాను ఆశ్చర్యపోయి, ''ఎందుకలా నవ్వుతున్నావు? వంటలో ఏమైనా లోపం వున్నదా, లేక నౌకరు ప్రవర్తన నవ్వు తెప్పించిందా?'' అని అడిగాడు.

''అయ్యో, అదేం కాదు! అదేం కాదు!" అన్నాడు దొంగ.

''ఐతే, మరెందుకు నవ్వినట్టు?'' అని అడిగాడు సుల్తాను.

దొంగ ఒక క్షణం ఆగి, పళ్ళెంలోని వేయించిన కముజు కేసి చూస్తూ, ''గతంలో జరిగిన ఒక సంఘటన, యీ కముజు పిట్టను చూస్తూంటే జ్ఞాపకం వస్తున్నది. ఒకసారి కొండదారిలో ఒక



ముసలివాణ్ణి దోచాను. డబ్బు తీసుకున్న తరవాత, వాడు ప్రాణాలతో వదులుతా ననుకున్నాడు. కాని, నేను కత్తి పైకెత్తి చంపబోయేసరికి, వాడికి భయంతోపాటు ఆశ్చర్యం కూడా కలిగింది. కనుచూపు మేరలో ఎక్కడా మనిషన్నవాడు లేడు. ముసలివాడు ఆకాశంలో ఎగురుతున్న ఒక కముజుపిట్టను చూసి, యీ జరగనున్న హత్యకు నువ్వు సాక్ష్యం అంటూ అరిచాడు. ఏ మనిషయినా పక్షిని సాక్ష్యం కోరడం వినివున్నామా?'' అని నవ్వసాగాడు.

సుల్తాను అంతా విని తల వూపి, ఆలోచిస్తూ వూరుకున్నాడు. దొంగ కముజు పిట్టను వేలితోతాకి, ''ఆహాఁ, పిట్టా! నువ్వా ముసలివాడు సాక్ష్యం అడిగిన కముజుపిట్టవు కాదుగదా? అలా కాక పోతే, దాని దూరపు చుట్టానివయినా అయి వుంటావు!'' అంటూ పొట్టచెక్కల యేలా నవ్వసాగాడు.

సుల్తాను హఠాత్తుగా కళ్ళెర్రచేసి, ''ఆ నవ్వాపు!'' అన్నాడు భీకరస్వరంతో.

దొంగ చప్పున నవ్వడం మాని, సుల్తాను ముఖం కేసి బెదురుతూ చూశాడు.

''ముందు ఆ తినడం కానియ్యి. నువ్వు దారుణంగా చంపిన ముసలివాడి పక్షాన కముజుపిట్ట సాక్ష్యం యిచ్చింది! చని పోయే ముందు అతడు కముజు సాక్ష్యం పట్ల వుంచిన నమ్మకాన్ని, నేను మెచ్చు కుంటున్నాను,'' అన్నాడు సుల్తాను.

దొంగ నిలువెల్లా వణికిపోతూ ఒక రొట్టెముక్క నోట్లోపెట్టుకున్నాడు. ఆపైన ప్రాణభయం కొద్దీ వాడు తిండి తినలేక పోయాడు.

సుల్తాను తన భటులను పిలిచి, దొంగను చూపుతూ, ''మనిషి రూపంలో వున్న, యీ ఘాతుకమృగాన్ని యిక్కడ నుంచి తీసుకుపోయి తక్షణం శిరశ్ఛేదం చెయ్యండి!'' అని ఆజ్ఞాపించాడు.

దొంగకు శిరశ్ఛేదం జరిగింది. ఈ విధంగా మరణసమయంలో ముసలివాడు కముజుపిట్ట నుంచి కోరిన సాక్ష్యం లభిం చింది.



# నశించిపోతున్న జంతుజాలం

ప్రకృతి అరుదైన వింత జంతు జాతుల నెన్నింటినో సృష్టించింది. మనం వాటిని సంరక్షించుకోడానికి గట్టిచర్యలు తీసుకోకపోతే, అవి కాలక్రమాన నశించిపోయే ప్రమాదం ఉన్నది.

గత శతాబ్ది మధ్యంలో, ఉత్తర అమెరికాలో ప్రతి విందులోనూ ప్రత్యేక ఆకర్షణగా ఉండేది ప్యాసెంజర్ పీజియన్ అనే పావురం వంటకం. ఆ పావురాలు కొమ్మలపై గూళ్ళు కట్టుకుని గుంపులు గుంపులుగా నివసిస్తూ వుండేవి. మిచిగాన్,. పెన్సిల్వేనియా ప్రాంతాలలో ఒక సంవత్సరం తిరిగే లోపల ఒకటిన్నరకోటి పావురాలు ఆహారం కోసం మనుషులచే చంపబడ్డాయి. 1888 నాటికి ఆ పావురాలజాతి దాదాపు నాశనమైపోయింది. సిన్సినాటీ జంతు ప్రదర్శనశాలలో మిగిలివున్న ఒక్కగానొక్క ఈ జాతి పావురం 1914 లో చచ్చిపోయింది।

ఈ పావురం జాతిలాగే నశించిపోయిన పక్షిజాతులూ, జంతువులూ ఎన్నో వున్నాయి. చరిత్ర కందిన మేరకు మనిషి 100 జాతుల జంతువులనూ, 160 జాతుల పక్షులనూ నిర్మూలించి వున్నాడు. ప్రస్తుతం 1000 జాతుల జంతువులూ, 20,000 జాతుల మొక్కలూ నిర్మూలమైపోయే దశలో వున్నాయి. అలా నిర్మూలమైపోతూన్న వాటిలో తిమింగిలాలు ప్రధానమైనవి.

క్యూబాలోనూ, దక్షిణ అమెరికాలోనూ ఒకప్పుడు విశేషంగా కనిపించేవి, పట్టుకుచ్చు వడ్రంగి పిట్టలు. అవి నివసించే వృక్షాలు నశించడంతో ఆ పిట్టలు కూడా కనుమరుగవుతున్నాయి. బోర్నియోలోని ఒరంగుటాంగ్ అనే తోకలేని కోతులకూ, దక్షిణ అమెరికాలోని జాగువార్ అనే చిరుత పులులకూ ఇదేగతి పట్టేట్టున్నది.





అరేబియన్ ఓరిక్స్ జంతువుల సంరక్షణకు అరిజోనాలోని ఫోనిక్స్ జంతుప్రదర్శనశాలలో ఆవాసం ఏర్పాటు చేయబడి వుంది. నశించి పోతున్న హవాయ్ నీనీ జాతికి చెందిన బాతులను, సర్ పీటర్‌స్కాట్ కనిపెట్టి స్లిమ్‌బ్రిడ్జ్ వద్ద రక్షణ ఏర్పాటు చేశారు।



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1985 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.



M. Natarajan



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఫిబ్రవరి నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: అడుగు అడుగున ప్రమాదం    రెండవ ఫోటో: ప్రతి అడుగు ప్రమోదం

పంపినవారు: ఎం. వి. శరత్‌బాబు, బి'లింగంపల్లి, హైదరాబాదు–44.

బహుమతి మొత్తం రు. 50/–నెలాఖరులోగా పంపబడుతుంది.

### మీకు తెలుసా? సమాధానాలు

1. బోర్నియో 2. ఐబీరియా 3. హైఫా 4. సాయిద్, సూయెజ్ రేవులు 5. అమూదార్యా

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.


బబుల్ భాష-1




















BIG FUN

**Results of Chandamama Camlin Colouring Contest No.38 (Telugu)**

*1st Prize:* A. Sasikala, Madras-600 014. *2nd Prize:* A. Govardhana, Nellore-524 314. S. Narsimha Chary, Nanded. L. Gouri Sankar, Orissa-765 001. *3rd Prize:* C.S. Sunandini, Tirupati. M. Yugandhar, Madras-17. K. Venkata Ramana Reddy, Proddatur. C.S. Sunandini, Tirupati. Kodati Venu, Nalganda. S. Ravi Raju, Bheemali. K.V.S.S Manyam. Balasore. V. Srinivas, Bhubaneshwar-751 001. C.H. Krisha Veni, Hyderabad-500 004. B. Nagendrudu, Panyam-518 112.

